Regd No. N. 45 / M 3813

వెల ఒక అణా

102818

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

★ హంగరీ, రుమేనియాలు శాంతించుట ★

★ జపానులో యుద్ధమంత్రివర్గ నిర్మాణము ★

సంపుటము ౧౫ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౨ విక్రమసం॥ ఆషాఢ శు॥౧౪ (౧౮-౧౦-౧౩౪౯ ఫ.) గురువారము సంచిక ౭౨

# చైనా సముద్రపు ముట్టడి ప్రారంభము

## చైనా రేవులనుండి పోవుటకై బ్రిటిషుఓడలకు 'ప్రార్థన'

## జపానును చైనానుండి తరుమువరకు చైనాయుద్ధ ప్రతిజ్ఞ

యూరపుఖండమునందు జర్మనీ, ఇటలీలు బ్రిటనుపై దండయాత్రకు సన్నాహము చేసికొనుటలో మగ్నములైయుండ, తూర్పువైపు జపాను ఇదేరా సమయమని, తనకు కావలసినదానిని జపురుకొనుటకై చురుకుగా పనిచేయుచున్నది. జపాను చైనా నంతయు ఇపుడే పూర్తిగా ఆక్రమించుటకు సౌకర్యము కల్పించుకొనుటకై చైనా దేశస్వాతంత్ర్యము నిల్పుకొనుటకై పోరాడుచున్న చంకింగు ప్రభుత్వమువారికి ఇండో చైనామీదుగా యుద్ధసామగ్రి రాకుండునట్లు చేయవలసినదని ఫ్రెంచిప్రభుత్వమువారిని, బర్మానుండి యుద్ధసామగ్రిరాకుండునట్లు చేయవలెనని బ్రిటిషుప్రభుత్వమువారిని కోరియుండెను, ఫ్రాన్సు తన ఆగతికావస్థలో జపాను ఇష్టప్రకారము చేసెదనని ఒప్పుకొనెను. బ్రిటిషువారు అట్లుగాక తటపటాయించుచున్నట్లు కనబడుచున్నది. చంకింగుప్రభుత్వమునకు బర్మానుండి యుద్ధసామగ్రి పోరాదనుసిద్ధాంతమునుఒప్పుకొనగలమని మాత్రమే బ్రిటిషువారు తెలియజేసినట్లగపడుచున్నది. ఆ సిద్ధాంతము ననుసరించి ఏ వస్తువులును పోనీయరాదు, ఎంతకాలమిట్లు పోనీయరాదను విషయములనుగూర్చి బ్రిటనుజపానులు రాయబారములు జరుపుకొనుచున్నవి. బ్రిటను మూడునెలలకాలమువరకు ఇట్టినిర్బంధమున కంగీకరింతుము, ఆటుతర్వాత పరిస్థితినాలోచించి దానికితగినట్లు నిర్ణయించుకొనుటకు మాకధికారముండవలసినది. అనికోరుచున్నట్లు అగపడుచున్నది.

### చైనాజపానులకుసంధికుదుర్పుయత్నము

అసలు తనసామ్రాజ్య భాగములవిషయములో ఎట్టిచిక్కులులేకుండ జర్మనీతో యుద్ధము సాగించుట మంచిదనుతలపుతో బ్రిటను జపాను చైనాలకు సంధికుదుర్చుటకై యత్నములను చేయుచున్నట్లును, చైనావారు తమకుచేసిన కొన్ని సూచనలపై ఈసంధిరాయబారము ప్రారంభించబడినట్లును. మొత్తముమీద తూర్పుఖండములో యుద్ధజ్వాలలవల్ల తనసామ్రాజ్యభాగములకెట్టి ఉపద్రవముగాని లేకుండచేసికొనుటకై బ్రిటను తనకు పీకలవంతఎక్కువభాగము లొంగక అవసరము మలయాగవర్నరగు యస్. డబ్ల్యు. జోన్సుగారు జూలై ౧౪ వ తేది సింగపూరులో బ్రాడ్ కాస్టు ఉపన్యాసములో చెప్పినారు. కాని గవర్నరు గారిట్లు చెప్పుటకు బ్రిటిషుప్రభుత్వముయొక్క కాలనీలశాఖ అధికారమిచ్చియుండలేదని రూటరుఏజన్సీయొక్క విలేఖరి తెలిసికొంటినను చున్నాడు. అసలు రాయబారములు నని బ్రిటను జపానుల మధ్య ప్రతినిధులద్వారా జరుగుచునేయున్నవను సంగతి సత్యమట. ఇంతేకను ఆరాయబారములో ఏమిమాటలు జరుగుచున్నవనునదియే ఖండనభాషణలకు గురియైనది. బ్రిటనుకు తూర్పు ఖండప్రాంతములోనుండు సామ్రాజ్యభాగముల సమీపములో యుద్ధముజరుగకుండ చేయవలెననెడి శ్రద్ధయేఉన్నదని తలచుటలో అసత్యమేమియు ఉండజాలదు. జపాను బ్రిటిషు ప్రభుత్వమువారి జవాబుతో సంతృప్తిజెందవెనుటవల్ల బ్రిటిషుప్రభుత్వము జపానుకోరిన సాయమును ఇచ్చివేసినట్లే నమ్మవచ్చును, లేకున్న జపాను అంగీకరించునా?

### చైనా రేవులపై చర్య

ఇంకను ఒకవైపు విశేషాంశములను గూర్చి ముచ్చటించుచునేయుండ ఇటు జపాను జూలై ౧౫ వ తేదినాడు చైనాలో ఫూచౌ, సాంచాపు, వెంచౌ, మిన్హోఅనునాలుగురేవులపై చర్యగైకొనదలచినానుగనుక, మీఓడలను ఆప్రాంతమునుండి తీసివేయించవలసినదని బ్రిటిషువారిని కోరినది. ఆతేదితరువాత అక్కడ బ్రిటిషు ఓడలింకనుఉన్నచో నేనుదానికి జిమ్మేదారికాను అని జపాను నిశ్చయపరచినది. బ్రిటిషువారు తమకిచ్చిన గడువుచాలదు కాబట్టి జపానుచర్యచే తమకు నష్టముకలుగుచో జపాను కట్టియివ్వవలసియుండునని జవాబిచ్చినారు. జపాను ఈ జవాబు కేమనునో,

ఈలోగా బర్మానుండి ఎట్టియుద్ధసామగ్రికూడ చంకింగ్ ప్రభుత్వమునకు చేరకుండ చేయుట సిద్ధాంతముమట్టుకైనను బ్రిటిషుప్రభుత్వము ఒప్పుకొన్నందుకు చైనాప్రభుత్వము తనఅక్షేపణను బ్రిటిషుప్రభుత్వమువారికి తెలియబరచినది. ఇట్లే ఫ్రెంచి ప్రభుత్వమువారికిని మించి పెట్టుకొనినారు. కాని ఈ మెలికలన్నిటినివిని తీర్చునది మాత్రము తోచుటలేదు.

చైనాకు బర్మామీదుగా యుద్ధసామగ్రి పోనీయకుండుటకు ఎట్టిఏర్పాట్లు చేయవలెనను విషయమై జులై ౧౫వ తేదిఉదయము జపాను విదేశాంగ మంత్రియగు అరిటాగారితో జపానులో బ్రిటిషు ప్రభుత్వ ప్రతినిధియగు రాబర్టుక్రెయిగీగారు మూడుగంటలకాలము సంభాషించిరి.

ఫ్రెంచివారి ఇండోచైనామీదుగా చైనాకు యుద్ధసామగ్రిని పోనీయకుండ చేయుటకై ఫ్రెంచిప్రభుత్వము అంగీకరించియుండెనుకదా. ఫ్రెంచి ఇండోచైనాకు కాట్రూగారు గవర్నరుజనరలు ఈయన ఇంకను జర్మనీతో ఫ్రెంచిప్రజలు యుద్ధము సాగించుచుండవలెనని ప్రచారము చేసినందుకై పెటెయిను ప్రభుత్వమువారు ఈయనను ఫ్రాన్సుకు తిరిగిరావలసినదనియు, ఈయన స్థానమును వైస్ అడ్మిరల్ డీకాగారు స్వీకరించవలెననియు ఆజ్ఞాపించిరి. కాట్రూగారు తమస్థానమును వదలకుండవున్నారు. అట్టి వీరిని దక్షిణచైనాలో జపానుదండయాత్ర సేనలప్రతినిధియగు కర్నల్ కేన్జియో సాటోగారు జూలై ౧౬ వ తేదినాడు దర్శించి ఒకగంటసేపు సంభాషించిరి. ఈ సంభాషణలో ఫ్రెంచిగవర్నరు జనరలు చైనాలో జపానుదండయాత్ర జయవంతమగుటకు తనకు అధికారమునంతవరకు తాను సహాయపడెదననియు, సహాయము లేని విషయములలో ఫ్రాన్సుప్రభుత్వమునకు జపానుకు అనుకూలమైన శిఫారసులు చేసెదననియు చెప్పినట్లు వార్తవచ్చినది, మరి అసలునీవు గవర్నరుజనరలుగానుండక దేశమునకు రావలసినదని ఫ్రెంచిప్రభుత్వముచే ఆజ్ఞప్తుడైన కాట్రూగారు ఇట్టివాగ్దానము చేసినమాట నిజమైనచో అదిచెల్లేది ఎట్లు అనుసంశయమునకు సమాధానము చిక్కుటలేదు.

జూలై ౧౭వ తేదినాడు చైనాముట్టడికి ప్రారంభముగా హాంగ్చౌఅఖాతముమీద జపానుయుద్ధనావలుదూకినవి. జపానులోఇంతవరకుండిన మంత్రివర్గము రాజీనామానిచ్చినట్లును, ఇరువురు ప్రతికూలపక్షసభ్యులతో కలిసి ఐదుగురు మంత్రులుగల యుద్ధమంత్రివర్గము నియమించబడునట్లును నిర్ణయము చేయబడినది.

జపానులో కొన్నిపత్రికలిపుడు జర్మనీ బ్రిటనుపై యుద్ధముప్రారంభించులోగా జపానుజర్మనీ ఇటలీలతో మైత్రిని కుదుర్చుకొనవలసినదని సూచనలజేయుచున్నవి,

చైనాలో ప్రభుత్వాధికారములోనున్న పక్షముయొక్క సమావేశమొకటి జూలై ౧౭వ తేదినాడు జరిగినది. ఆసమావేశాంతమున ఒక ప్రకటనచేయబడినది. అందులో శత్రువుచైనాదేశమునుండి తొలగించబడువరకు చైనావారువదలకుండ యుద్ధముసాగించుచునే యుందురనియు, అందుకై చైనాదేశమంతయు సైనికప్రధానముగ చేయబడుననియు చెప్పబడినది. ప్రపంచములోని దేశములన్నియు జపాను తమకందరికిని శత్రువని గ్రహించి, చైనాకు తోడ్పడవలెనని కోరబడినది. జపాను అన్ని దేశములకు శత్రువుఅనిచెప్పుట ఎందువల్లననగా చైనాలో జపానుఆక్రమణము నిపుడు నిరోధించనిచో, ఇకముందు పసిఫిక ప్రాంతములోగాని, ఇండియా సముద్రప్రాంతములోగాని జపాను ఆక్రమణమును నిరోధించుట ముందుకష్టమగుననియు ఆప్రకటనలో చెప్పబడినది. ప్రభుత్వపక్షముపేరు కోమింటాంగు పార్టీ.

### ఫ్రాన్సుగతి

ఫ్రాన్సులో పెటెయినుగారు క్రొత్తగా నియంతవలె అయినారని గతసంచికలో చూచియున్నాము. ఈవిధముగ రాజ్యాంగమును మార్చుటలో రహస్యమేమియనుదానివిషయమై ఊహలు అల్లబడినవి. వాటిని కొద్దిగా ఇపుడుచ్చరించెదము. నియంతృ పరిపాలన వ్యవస్థగల జర్మనీ ఇటలీలను సంతృప్తిపరచుటకై ఇట్లు చేసియుండవచ్చునని ఆనేకసంభావన, కాని కేవలము రాజ్యములోని వ్యవస్థమార్చుకొని దేశము మార్చుకొన్నంతమాత్రాన జర్మనీ, ఇటలీలు సంతృప్తిపడునని నమ్ముట వెఱ్ఱితనముకాదా' అట్టి ఆశకు ఇటలీ. జర్మనీల పత్రికలలో సమాధానమీయబడినది. "జియార్నేల్ డీ ఇటాలియా" అనుపత్రికలో ఫ్రాన్సు ఇట్టిరాజ్యాంగము మార్పుచేసికొను ఉద్యమము చాల ఆలస్యముగా ప్రారంభమైనదనుచు, ఈమార్పుచే ఫ్రాన్సు జర్మనీ, యిటలీలకోరికలను సంతృప్తిపరచవలసిన బాధ్యత తప్పిపోజాలదనియు హెచ్చరిక చేయబడినవి. తర్వాత జూలై ౧౭వతేదినాడు వెలువడిన "రిజెజియోని ఇంటర్నేజియోనాలి"అనుపత్రికలో ఫ్రాన్సు, జర్మనీలు యూరపుఖండ వ్యవస్థనంతయు పూర్తిగామార్చి క్రొత్తఏర్పాటుచేయవలచినవనియు, ఈక్రొత్తవ్యవస్థలో చిన్నచిన్న రాజ్యములు అన్నియు పెద్దరాజ్యముల రక్షణక్రింద ఉండునట్లు ఏర్పాటు చేయబడునని యు, ఫ్రాన్సు నియంతృత్వ పరిపాలన వ్యవస్థ స్వీకరించినను లేకున్నను ఇదివరలో జర్మనీ ఇటలీలపై యుద్ధప్రకటన చేసియున్నందులకు బాధ్యతను తప్పించుకొనజాలదనియు బెదరింపుచేయబడినది జూలై ౧౭వతేదినాడు జర్మనుమైక్లన్ వ్యాఖ్యాత ఏమనెనో చూడుము, ఫ్రాన్సులో రాజ్యాంగముమార్చుటకు జరిగినయత్నము నిష్కల్మషమైన హృదయముతో చేయబడెనని జర్మనీ నమ్మజాలదనియు, ఫ్రాన్సువిదేశములలోభాగములపై తిన సామ్రాజ్యాధికారమును వదలుకొని: యూరోపానఁతము వర్సైలీసుసంధివల్ల యేర్పడియుండిన వ్యవస్థలోనుండి ఉద్ధరించి క్రొత్తవ్యవస్థను స్థాపించుటకు ఫ్రాన్సు తోడ్పడవలెనని మాత్రమే జర్మనీకోరకయనియు అతడు చెప్పినాడు. బహుశా జర్మనీ అనుమానించుచున్నదని చెప్పినట్లు యుద్ధములో పరాజయాంగీకారముచే విషమప్రాంతమైన ఫ్రాన్సులో వ్యవహారములను సద్దుబాటుచేసి పునరుద్ధరించవలెననిన నియంతృ పరిపాలన వ్యవస్థయే అనుకూలము. కాని తిరిగి ఫ్రాన్సు విజృంభించగలస్థితికి వచ్చుదనుక జర్మనీ, ఇటలీలు ఊరక యుండునా?

### ఫ్రాన్సు సామ్రాజ్యము

ఫ్రెంచివారి సిరియాలో సేనలను నిరాయుధముగ చేయుటకు ఆజ్ఞను ఫ్రెంచి సేనాధికారి చేసినాడు.

ఫ్రెంచిఓడలను వేర రేవులలోఉన్నవాటిని బ్రిటిషువారు పట్టుకొనుచుండిరిగదా! ఆప్రయత్నము ఇపుడు ఆపివేయబడినదని జూలై ౧౭వ తేది బ్రాడ్ కాస్టు ఉపన్యాసములో బ్రిటిషుప్రధాని చర్చిల్ గారు చెప్పినారు ఇంకను అనేకములైన ఫ్రెంచియుద్ధనౌకలు ఆయారేవులలో ఉన్నవి కాని వాటివల్ల బ్రిటిషువారి నౌకాబలమునకు లోటుఏమియులేదని చర్చిల్ గారు ప్రకటించినారు. ఈలోగా "యమిల్ బెర్టిన్"అను ఫ్రెంచిక్రూయిజరు, హాలిఫాక్సు రేవునుండి తప్పించుకొని మార్టినికుదీవికి చేరినది.

ఫ్రాన్సుసముద్రపురేవులును, నదులరేవులును సీనునదినుండి బిడసోవావరకు ఉండేవి, మధ్యధరాసముద్రములోను, ఉత్తరఆఫ్రికాలోను ఉండేరేవులతోసహా అడ్మిరల్ డార్లన్ గారి అధికారములో నుంచబడినవి.

జనరల్ డీగాల్ గారు జూలై ౧౭వతేది లండను నగరములో చేసిన బ్రాడ్ కాస్టులో ఇపుడు భూమ్యాంతరిక్ష సముద్రములయందెక్కడగాని ఎప్పుడుగాని తనఆజ్ఞ వెంటనే పోరాటమును ప్రక్రమించగల గొప్పసేన యిప్పటికేర్పడినదని ప్రకటించినారు. యుద్ధము జరుగుచుండుకొలది ఈసేన పెక్కువకాగలదనికూడ ప్రకటించినారు.

ఫ్రాన్సుకు సంబంధించిన వార్తలలో ఇక చెప్పదగినది జూలై ౧౭వతేదినాడు లండను నగరమునందు, ఫ్రాన్సులో ప్రస్తుత ప్రభుత్వకేంద్ర)

(రావ పేజీచూడుడు)

# దేశీయసంస్థాన ప్రభువు
# ఇప్పటి క్లిష్టపరిస్థితి

## మహాత్మా గాంధిగారి అభిప్రాయము

దేశీయ సంస్థానములోని కొందరన్నే హితులు అచటి భయోత్పాత పరిస్థితులనుగురించియును రానున్న అరాజకమును గురించియును నానావిధాల వర్ణించిచెప్పిరి.

"ఇట్టిపరిస్థితులలో దేశీయప్రభువుల కర్తవ్య మేమి" అని గాంధిగారిని విచారించిరి.

అందుపై గాంధిగారిట్లు పలికిరి:—

"సంస్థానాధిపతులుగా నుండుటను మాని యీప్రభువులు ప్రజాసేవకులై యుండవలెను." ఈసంక్షిప్తవాక్యాన్ని కురల వారే యిట్లు విపులీకరించిరి

"ఈప్రభువులు తమ ఉన్నతస్థానాలనుండి క్రిందికిరావలెను ప్రజాసహకారాన్ని కోరవలెను. ఈక్షిప్రకారమాచరించిన అల్లకల్లోలములు కలిగినవాటిని నణచుటకు బలప్రదర్శనము చేయవలసినగతి పట్టును. కాంగ్రెసు దేశీయప్రభువులను తొలగింపగోరదు. ఈప్రభువులు తమ రాజ్యములలో శాంతితృప్తి సంస్థాపనార్థమై కాంగ్రెసు సహాయమును కోరవచ్చును. ఈరాజులు తమ ప్రజలయొక్క నిజమైన సేవకులుగా నుండవలెను, అట్లుచేసినచో వారిని తొలగించుటకై యెవ్వరునుకోరరు, తాము సేవకులుగను తమప్రజలు యజమానులుగను ఉండినయెడల యజమానులు తమసేవకుల సెంపుకుతొలగింతురు, కాంగ్రెసుతో సమాధానపడవలెనని కోరు చిన్నచిన్న ప్రభువులెందరో కలరని అనుచున్నారు. అట్లువారు సిద్ధమైయుండిన ఇట్టికొద్దిపాటి పనిని చేయుటకేమి అభ్యంతరమున్నది. ఒకప్రక్కన బ్రిటిషు సామ్రాజ్యాధికారవర్గము వారివలనను ఇంకొకప్రక్క పగతీర్చుకొనకోరు ప్రజలవలనను ఈరాజులకు భయమున్నదనువాదము అసత్యము. వీరు న్యాయముగా వర్తించవలసిన ప్రజలు పగతీర్చుకొందురనుట నేను నమ్మను. ఔంధురాజాగారు తమప్రజలు తిరుగుబాటు చేయుదురని భయపడుచున్నారా? లేదు! తన అధికారాలనన్నిటిని ప్రజలకిచ్చివారని ప్రజలకు తెలిసినతర్వాత వారేల తిరుగుబాటుచేయుదురు. వారు తిరుగుబాటుచేసిన యెడల రాజాగారు తనకోటను వశపరచుకొనుమని ప్రజలకు చెప్పగలరని నమ్ముచున్నాను.

"ఎంతటి ధైర్యవంతుడైనా సరే నాలితోకూడ నివసించుటకు సమర్థుడు" అనికూడా చెప్పగలరు. ఔంధురాజాగారి వంటివారైన అప్పాసేహెబ్ ఏరాజ్య సేవకుడును చేయువిధముగా తనప్రజలకొరకై రాత్రింబగళ్లు చాకిరీచేయుచున్నాడు. అప్పుడువిషయ మేమిటంటే ప్రజలకు తమయేలికల సద్భావనమునుగురించి విశ్వాసము కలుగవలెను. ఈరాజులు రెండుపనులను చేయవలసియుండును. మొదటిది—తమజీవితములను పరిశుద్ధపరచుకొని కేవల నిరాడంబరజీవనము నవలంబింపవలెను. తమసొంతమునకై వారు చేయువిపరీతమైన వ్యయము అనవసరముతో కూడినట్టిది. తమ ప్రజలలో వేనవేలు ఒకపూటకైనను భోజనములేనివారైయుండగా తమప్రజల ద్రవ్యాన్ని తమ భోగలాలసతకై దుర్వినియోగము చేయుటకెట్లు వీరికి మనస్సొప్పెనో నాకు అగమ్యగోచరమగుచున్నది. వీరు నెలకు రెండుమూడునూర్ల రూపాయిలతో ఏల తృప్తిపడియుండరాదు? నాయభిప్రాయ మేమిటంటే వారికివారు ప్రజలేమియిత్తురో గాన్ని స్వీకరించవలెను. తమ సొంతవ్యయముల పై ప్రజలకు నియంత్రణము ఉండవలెను తమ ఏలిక తీసుకొను ద్రవ్యముపై అధికారము ప్రజలకుండవలెను ఏ సంస్కరణ లిచ్చినగాని ఏ ఆదాయ వ్యయపట్టీల నిర్ణయవిధానము విశ్వస్తముగా చేయుదురో కాలము మారిపోయినది. ఏరాజుజీవనము జనులజీవనముతో సమన్వయముకావో ఏరాజును ప్రజలను అవమానించునో అట్టివాని పరిపాలన సహింపరానిదగును. రెండవదేమన ఈ సంస్థానాలలోని న్యాయశాఖ నిష్పక్షపాతమైనదిగాను నిష్కళంకమైనదిగాను ఉండవలెను. ఈశాఖ ప్రభువుల వశములో నుండక స్వతంత్రమైనదిగా నుండవలెను. ఏసంస్థానములో గాని నిజముగా న్యాయశాఖ స్వతంత్రమైనదిగా ఉన్నదని నేను కచ్చితముగా చెప్పజాలను. మరియు ప్రజలకు సంపూర్ణముగా ప్రాథమికస్వత్వములు ఉండవలెను.

సంస్కరణములలో ఇవి మొట్టమొదటివిగానున్నవి బ్రిటిషు ప్రభుత్వముయొక్క భయము నిరాధారమైనది. ఈ బ్రిటిషుప్రభుత్వము న్యాయమైనసంస్కరణముల విషయమై బహిరంగముగా ఏమియు వ్యతిరేకముగా అడగించదు, ఒకవేళ అడ్డినా వారు జోక్యము కలిగించుచున్నారంటే అది ప్రభువుయొక్క వర్తనములో ఏదో వంకను పురస్కరించుకొని చేసిన విషయముగానున్నది. పర్యవసానమేమన ఈరాజులు "సీజర్ భార్య" వలె అనుమానరహితముగానుండవలెను. ఇక కాంగ్రెసు అన్నచో అదియెప్పుడైనను సరే వారితో సంప్రతించుటకు సిద్ధముగానున్నదని వారెరుగుదురు. కాంగ్రెసు ప్రధానముగా అహింసాబద్ధమైనసంస్థ. ఈ జాతి తమంతటతామే ప్రజల అధికారమునకు లోబడినవారైనచో కాంగ్రెసువారిలో స్నేహమును పాటించును. అటుల చేయనివారికి ముందుప్రమాదాలుకలుగును. ఈరాజులు తమతప్పులుతాము సవరించుకొనక తప్పు నాశనము కావింపుకొనినతప్ప కాంగ్రెసువీరిని నాశనముచేయుటకై కోరదు. అని నేను మరొకమారు చెప్పుచున్నాను. ప్రజాసేవకులై యుండుటకు సిద్ధపడిన ఒకరాజైన ఉండిన చో కాంగ్రెసు అట్టివానికి అంతగానిలువగలదు.

## బొంబాయిరాజధానిలో విద్యాభివృద్ధి

### ప్రాథమికవిద్యపై ఉకి పాఠశాలవ్యయము

### ఖాన్గీబళ్లకు సంపూర్ణస్వేచ్ఛ

౧౯౩౮ సంవత్సరమున బొంబాయిరాజధానిలో విద్యాభివృద్ధి సర్వతోముఖంగా జరిగింది. పూర్వంకంటే కేవలా బళ్లు ఎక్కువైనవి. మొత్తముబళ్లు ౧౫౭౭౨ అందులో ౧౬౬౮౩౬ ప్రాథమికబళ్లు (ప్రైమెరీబళ్లు) ౧౧౧౮ స్పెషల్ బళ్లు ౧౭ ఆర్టుకాలేజీలు ౧౨ ఇతరకాలేజీలు ౩౩౦ మాధ్యమిక పాఠశాలలు

ఒక్క ప్రైమరీస్కూళ్లలోనే ౩౮౯౧ బళ్ళు ఈఒక్కసంవత్సరములోనే ఎక్కువయ్యెను. దీనికి కారణంఏమనగా చాలా మంది ప్రజలు ఖాన్గీబళ్లను స్థాపించిరి.

బొంబాయిరాజధానిలో ౨౧౬౬ నగరాలు గ్రామాలుకలవు. ౧౧౧౪౭ గ్రామాలలో బళ్లున్నవి. అనగా ప్రతిరెరున్నర చదరపు మైలుకు ఒకబడిచొప్పునఉన్నవి. బొంబాయి రాజధానిలో ప్రతిచదరపుమైలులో సరాసరి ౨౩౭ జనులు నివసించుచున్నారు. మద్రాసు రాజధానిలో ప్రతిమైలుకు ౩౧౫ బెంగాలులో ౬౪౬ మొత్తం ఇండియాలో ౨౪౭ జనులు నివసించుచున్నారు!

బొంబాయిరాజధానిలో మొత్తము చదివే విద్యార్థులసంఖ్య ౧౫౬౬౪౪౧.

ప్రైమరీబళ్లలో ౨౪౧౦ ఖాన్గీబళ్లు క్రొత్తగా ఏర్పాటైనవి. ఇది అపూర్వమగు అంశము. ఈ బళ్లకుగాను ప్రభుత్వమువారు ౪ లక్షలు ప్రత్యేకించిరి. అయితే ఈఖాన్గీబళ్లు ఈ ౪ లక్షలను పూర్తిగా స్వాహాచేసి పైగా ౨౨వేలను మింగివేసినవి. ౭౦౦ జనసంఖ్యగల ప్రతిగ్రామములోను ఒకఖాన్గీబడిపెట్టితే సర్కారువారు ఏడాదికి ౨౦౦ రూపాయిల చొప్పున ఇచ్చుటకు ఏర్పాటుచేసినారు.

పల్లెలలోని ప్రాథమిక పాఠశాలలలో పూట పద్ధతి (షిఫ్ట్ సిస్టం) ఆచరణలో పెట్టబడినది, స్వదేశి ఆటలకే ఎక్కువ ప్రోత్సాహమియ్యబడుచున్నది. "ఆట్యాపట్యా" "ఖోఖో" "హుటుటు" అనుఆటలున్ను "లోజి," "టిప్రియా" అనుకసరతులున్ను ప్రచారములోనికి తేబడినవి.

చాలా రాత్రిపాఠశాలలు తెరువబడినవి. పఠనాలయాలు గ్రంథాలయాలు కొన్నిగ్రామాలలో స్థాపించబడినవి. బాలురకు ఆటమైదానాలను ప్రత్యేకించినారు.

అన్ని బళ్లలోను శారీరక వ్యాయమము నిర్బంధముగా చెప్పించబడుచున్నది. ప్రతిసంవత్సరము విద్యార్థులందరిని డాక్టర్లుపరీక్షచేసిపోవుచున్నారు.

విద్యపై బొంబాయిరాజధానిలో ౧౯౩౭లో ౩౭౬౬ లక్షలు (కల్దారు) వ్యయమయ్యెను. ౧౯౩౮ లో ౪౧౧ లక్షలు (కల్దారు) వ్యయమయ్యెను. ఈ వ్యయములో నూటికి ౬౩ రూపాయిలప్రకారము కేవలము ప్రైమరీ బళ్లపైననే వ్యయముచేసినారు.

## పసిపిల్లెత్తురు- కుక్క త్రాగుట

(స్వ-వి)    ఖమ్మంమెట్టు ౫-౧౦-౪౯ ఫ

౧-౧౦-౪౯ తేదీన (రా) మైళ్ళ దూరములో యున్న అమ్మపాలెంబంజరుదారు ఖమ్మంమెట్టు ఖాజీగారు ఫఖురొద్దీనా సాయంత్రం (౮,గంట లసమయమున ఒయు దేకివెళ్ళిరి అరాత్రి అలవాట ప్రకారం ఊరుబయటపడుకొనిరి వారు తమ శరీరము అయిదుగురికే స్వాధీనపరచి అంగ మర్దనము చేయించుకొంటూ యుంటారు అతీరుగనే ఊరోజుకూడాచేసుకొనిరి ఒంటిగంట కుమారు నిద్రపట్టినట అసమయముననే ఎవరో ప్రాణముపోవునట్లు గొడ్డలితోనో శక కొడవలి తోనో యెడమవైపు చేతిమీదుగా మూడుఅంగుళములలోతు గాయము చేరట. ఆ దెబ్బతో అయన స్మృతి తప్పెను, తెల్లవారిన తమువరి ఒకమాదిగవాడునెత్తురును కుక్క త్రాగుతూ యుండగాచూచి, భీతిజెంది ఆ వార్తను ఖమ్మం పోలీసుస్టేషనులోచెప్పి, తిరిగి కారుణు తీసుకొని వెళ్ళి ౧౦గంటలకుమారు ఖమ్మం దవాఖానాలో నికితీసుకొనివచ్చిరి ప్రమాదస్థితిలో యున్నాడు నిందితుడు పట్టుపడలేదు

మేళ్ళచర్వు లక్ష్మినారాయణగారి(౧౧,౦౦౦)ల మొకద్దమా ఇంకా జరుగుచునేయున్నది చో రుడుపల్లెవీరభద్రము వరంగల్ జిల్లాలో ఖమ్మం న్యాయస్థానమునుంచి మొకద్దమాను ఎత్తివేయుంచుటకు ప్రయత్నముజరుపబడుచున్నది ఇంకా పేషీలమీదనే జరుగుచున్నది,

ఒకపల్లెవానిని మోటారు నడుపుకొనుచున్న జాగీర్దారు తుపాకితోకాల్చినవార్త యీ పత్రికలో యిదివరలోవచ్చినది. ముచ్చర్లలో దెబ్బతినినవాడు నిమ్మళముగ నేయున్నాడు, పంగిడి జాగీరుదారు మరియు ఇతరులు, మిసల్ను ఖమ్మంకు మార్చుచేయించుకున్నారు నిందితులు జమానతు మీదవిడువబడిరి తదుపరి తుపాకిదెబ్బతిన్నివారు పైరవీచేసి మరియు పోలీసువారు పైరవీచేసి తిరిగి ఇల్లెందుకు మిసలు తెప్పించుకున్నారు. ప్రస్తుతము అర్జునినిందితులు ఇల్లెందునుంచి ఇతరచోటికి వెళ్లకూడదని, రూ౩౦౦౦లజమానతుతో విడుదలగా యున్నారుకాని డ్రైవరు తానేకొట్టినానవియు, ఇతరులఎవరుకొరవియు ఒప్పుకొంటూయున్నాడు, వానిని రిమాండులోనేయుంచినారు విచారణలోనే కేసుయున్నది

## శ్రీ సచ్చిదానంద పరమ హంసగారి ఉపన్యాసము

(స్వ వి)    మహబూబునగరము షహరేవరు ౭

శ్రీస్వామివారు మొన్నరాత్రి ౧౧ గంటలకు ఇప్పటూరునుండి ఇచ్చటికవచ్చిరి వీరిప్రయాణము బండిపైవర్షము చలిగాడ్పులోజరిగెను కావున నిన్నంత శ్రీవారుజబ్బుతోవుండిరి నిన్న సాయంత్రి ఉపన్యాసము జరుగునేమోయని జనముచాలగా కూడిరి కాని శ్రీవారు వారిశరీరావస్థను తెలుపుచు రేపు సాయంత్రి ౫గంటలకు ఉపన్యసించగలననిరి శ్రీవారివయస్సుఇప్పుడు(౭౫)సంవత్సరములు వృద్ధులయ్యు యోగనిష్ఠచే దాహదారుఢ్యముకలిగియున్నారు వీరురచించినగ్రంథములలో "జీవబ్రహ్మైక్యరాజయోగ సారమను గ్రంథము ముఖ్యమైనది ఈపుస్తకములో వారిజీవితముతోసహా రాజయోగసాధనక్రమము, మోక్షసాధనక్రమము లన్నియు విశదీకరించినారు భగవద్గీతా గూఢార్థముమతి కబీరుదాసు గారి జీవితముకూడ అద్వితీయంగా గావించినారు.

నేడుసాయంత్రి ౫గంటలకు శ్రీ రామమందిరములో ఉపన్యాసముజరుగునని నారాయణపేట, మక్తల్ దేవరకదిర మొదలగు పరిసరగ్రామముల నుండి జనమువచ్చెను మొత్తంమీద కనీసము (౫౦౦)జనముకూడెను స్థల సంకోచనమునుబట్టి ప్రేక్షకులకు యిబ్బందికలిగినను శ్రీవారియుపన్యాసాభిలాషులు రోడ్డుమీద, ఇంటిమిద్దెలమీద నిలిచియుండిరి

శ్రీవారుజగత్సృష్టిఏరీతిగాకలిగెను హృదయములో పరమాత్మ ఏరీతిగానివసించియున్నాడు శరీరతత్వము, జీవికిఆత్మకునుగలసంబంధము మనుజుడు లోకములో ఏరీతిగానివసింపవలయును జన్మరాహిత్యము పొందటానికి మనుష్యుడు ఆశాపాశనిర్ముక్తుడయి తనహృదయకమలములలో నివసించియున్న పరమాత్మనెరింగి బయల్పదేశమును మోక్షముపొందవలయును. ఈరీతిగా ఎన్నియో వేదాంతవిషయములు విశదీకరిస్తు రెండుగంటలవరకుఉపన్యసించిరి తర్వాత మంగళము జరిగెను రేపుశనివారము అంగడివ్యాపారస్థులకు సంతకావున, ఆదివారము సాయంత్రిము ౫ గంటలకు మంత్రోపదేశమునుగూర్చి ఉపన్యసించగలరట శ్రీవారు ఇచ్చట బుధవారమువరకుందురు

## బాల్యవివాహ నిషేధము

నల్లగొండ

నల్లగొండ ౮ షహరేవరు

నేడు శుక్రవారము సాయంత్రము శ్రీయుత సీతారామ రెడ్డి వకీలుగారి అధ్యక్షతలో శ్రీయుత పండిత వీరభద్ర దేవ సిద్ధాంతిగారు బాల్యవివాహ నిషేధచట్టపు ప్రస్తావమును ప్రస్తావించిరి ఇందు కనుకూలముగ కొందరు అనగా శ్రీయుతులు ఆళ్వారుస్వామి దేశోద్ధారక గ్రంథమండలి సికింద్రాబాదు, శ్రీయుత లక్ష్మీకాంతరావు వకీలు ఆర్యసమాజము నల్లగొండ, కార్యదర్శి శ్రీయుత దామోదరరెడ్డి ఆర్యసమాజసభ ఉపాధ్యక్షు గారలు మరియు అధ్యక్షులవారు ఉపన్యాసములుజెప్పిరి ఏకగ్రీవముగ ప్రస్తావముతీర్మానింపబడెను శాంతిపాఠానంతరము సభముగిసెను

### పెద్దగోపవరం గ్రంథాలయం

(స్వ-వి)    పెద్దగోపవరం అమర్దాదు ౩౪

పెద్దగోపవరం గ్రామము మధిర తాలూకాకు చెందినది అచ్చటిజనసంఖ్య అందాజా ౧౦౦౦ వరకుగలదు యువకులు వుత్సాహవంతులును, కార్యదీక్షాతత్పరులను, అనుటకు సందియములేదు ప్రమాధి సంII శ్రావణశు ౧౧ లు రోజున "ఆంధ్ర భాషోద్ధారక"అను పేరిట నొక గ్రంథాలయమును స్థాపించి నేటివరకు కడుశ్రద్ధాభక్తులతో కృషి సల్పుచుండిరి నేడు గ్రంధాలయసమావేశమున యువకులెల్లరును పాలుగొనిరి

చందాలు

| | |
|---|---|
| నెల చందాలు | రు ౩౧-౦-౦ |
| నేటివరకు నిలవచందా | రు ౧౫-౦-౦ |
| గ్రంథాలయగృహనిర్మాణమునకై వేయబడినచందాలు | ౪౦౦-౦-౦ |
| గ్రంథములు | ౨౦౩ |

యువకులింకను కృషిచేయుచున్నారు ఆవతికాలములో నింతవృద్ధికి తెచ్చిన శ్రీయుత బుధిరాజు నారాయణరావుగారు శ్రీయుత ఉప్పల వెంకటేశ్వర శాస్త్రిగారున్నూ తమస్వంతపనులకన్న ఎక్కువగా శ్రద్ధగరపుచున్నందులకు ఎంతయూ ప్రశంసనీయులు

## ... [illegible] కలరా

[illegible]కరంపేట, షహరేవర్ ౭

(స్వ వి)

ఈ తాలూకాపట్టె గ్రామాదులవారము లో గడ [illegible] చలిజ్వరములవలన [illegible] ఔషధము కొనుటకు దుర్లభమయ్యెను [illegible] సంభవయ్యె,

ఇప్పుడు (మాఘమాసము) అరుమాసముల నుండి కలరా వ్యాధిదాపురించెను ఇప్పటికిని అంత మొదలయ్యె జిల్లామొత్తము [illegible] పర్యటన డాక్టరు [illegible] సకాలమునకందకుండు [illegible] వ్యాధి కలిగినపుడు [illegible] ప్రజలకు ప్రధమావసరమైనది ఆరోగ్యమేకదా! కావున ప్రభుత్వమువారు దయతలచి మాన్యుజారీశాఖను తాలూకాకు ౩౦-౪౦ గ్రామములకొకటి ఏర్పాటుగావించి [illegible] యీవిధమునవే ప్రముఖ గ్రామముల కు (వైద్యాలయము లేకున్నను) కనిసముకొన ఆరోగ్యశాఖాపక్యటన ఇన్స్పెక్టరుగారినైన నియమించి ప్రతి గ్రామమునకు కనీసము మాసమునకు రెండు సారులులేక నొకమారైన ఆరోగ్య విషయములను కనుగొనుచు అవసరచర్యజరిపించు టకేర్పాటు గావించినకాని ఆరోగ్యవంతముగ సుఖజీవనము గడుపజాలము మాగత కాలానుభవమువలన విశదమగుచున్నది



## దొంగ యెవరు?

[illegible]తాలూకాలోని అద్రూరుఅనే గ్రామములో [illegible] కన్నయ్య అను నతడు యిట్లు వ్రాసినాడు—

"నా [illegible] రాత్రి నేను లేచునప్పుడు ౧౭ రూ॥ విలువగల వెండిబంగారు నగలు దొంగతనమయ్యెను వెంటనే పోలీసువారికి తెలుపుకొంటిని దగ్గరి రామన్నపేట పోలీసుస్టేషను నుండి మొహరిర్ వచ్చి విచారణచేసి నీ సామానులను నీవేదొంగిలించినావని నన్నే బెదిరించెను స్టేషనుకు నన్నుతీసికొనిపోయెను నేనుభయపడి ఆయన యెట్లుచెప్పుమంటే అట్లు చెప్పితిని ఈవిషయమై నేను పైఅధికారులతో మొరపెట్టుకొన్నాను.

# గోలకొండపత్రిక

విక్రమనామసం॥ర ఆషాఢ శు॥ ౧౪

గురువారము


## శిక్కు విద్యామహాసభ

గత వారము ౧౨ జులై నాడు హైదరాబాదు నగరములో శిక్కు విద్యామహాసభా సమావేశము జరిగెను. దాని అధ్యక్షుడు రాష్ట్రీయుడును, శిక్కును, అయిన సర్దారు దిలీప్ సింగుగారు. వీరు హైకోర్టువకీలు. ఔరంగాబాదులో నీ వృత్తిని నడుపుకొనుచున్నారు. ప్రతి జాతియు ఇప్పుడు విద్యావిషయమై మంచి శ్రద్ధ తీసుకొనుచున్నది. ప్రతిజాతిలోను విద్యకు గౌరవము హెచ్చినది. ఇది మంచిశుభ శకునమే. సిక్కులు హైదరాబాదు రాష్ట్రములో చాల కొద్దిమందియే — ౧౧౦౭౮ మందియే ఉన్నారు. కొద్దిమందియే యైనను ఈసంఘమునకు ఒక ప్రత్యేక విశిష్టతకలదు. ఇది మిలిటరీ ప్రాధాన్యత వహించిన జాతి అని ప్రసిద్ధిగాంచినది. ఈరాష్ట్రములో వీరి కందరికిని మిలిటరీలోను, పోలీసులోను ఉద్యోగాలిచ్చుచున్నారు. ఈ ఉద్యోగాలు వంశపారంపర్యముగా వచ్చుచున్నవి. దాని కారణమును అధ్యక్షుల వారే యిట్లు తెలిపియున్నారు—

"అసఫీయావంశ పీఠానికై ఈ శిక్కులు తమ రక్తాన్ని ప్రవహించినారు. మహారాజా చందూలాల్ గారి మంత్రిత్వకాలములో వారికి సిక్కుల సహాయ మవసరమయ్యెను. అప్పుడు పంజాబుకేసరియని ప్రసిద్ధిగాంచిన మహారాజా రణజిత్ సింగు గారికి వ్రాసికొని ౧౨౦౦౦ శిక్కు సవార్లను పంజాబునుండి రప్పించుకొనెను. ఈ ౧౨౦౦౦ పురుషసింహాలు అసఫీయా రాజ్యస్థాపనకై తమ రక్తాన్ని నీటివలె నే ప్రవహింపజేసిరి, వీరి యీ బలిదానమునకు మెచ్చుకొని వీరిసంతానమునకు వంశపారంపర్యేణ ఉద్యోగముల నిచ్చుటకను గ్రహించిరి."

సిక్కులు ఈ దక్కన్ పీఠభూమిలో వచ్చి నిలిచిపోవుట కింకొక కారణము కూడకలదు. వీరి తుదిగురువు గారును, వీరి మతమునందలి దశమావతార పురుషులును నగు గురు గోవిందుమహారాజుగారు పంజాబునుండి దక్షిణాభిముఖులై ఈ రాష్ట్రములోని జిల్లాప్రధాన స్థలమగు నాందేడులో వచ్చినిలచిరి. అచ్చటనే వారు ౧౭౦౮ క్రీ.శ.లో సమాధి పొందిరి. గురు గోవిందుగారిపై శిక్కులకు గాఢమగు భక్తి. వారికి పూర్వముండిన గురువులు శిక్కులను సాత్వికులను గాను కేవలము సన్యాసులనుగాను తీర్చియుండిరి. కానిరానురాను వారిపై అప్పటి మొగల్ సుల్తానుల ఒత్తిడి విశేషమయ్యెను హర గోవిందుగారు శిక్కులకు మాంసము తినుటకై ఆజ్ఞాపించెను. అట్లుచేసిననే వారు సిపాయీలగుదురని శాసించెను. గురు గోవిందుగారి కాలములో శిక్కుల దర్పము భరతఖండమంత టను వ్యాపించెను.

"సవర్యాలాఖ్ పర్ చఢావే
జబ్ గురుగోవిందకే నాం సునావే"

"గురుగోవిందు పేరుచెప్పితే సవాలక్ష సైన్యము అప్పుడే సిద్ధమౌతుంది" అని సామెతయయ్యె.

నాందేడులో శిక్కుల గురుద్వారా కలదు. శ్రీగురువుగారి సమాధికలదు. అత్యంత సుందరమును, విలువకలదియును శిల్పసౌష్టవము కలదియును నగు ఈ గురుద్వారమును హిందువులు తీర్థయాత్రగా సేవించుకొనిన తప్పుకాజేరదు. శిక్కులకును హిందువులకును భేదము లేదు. అయినను ఈ చర్చయిప్పుడప్రస్తుతము. చెప్పబోయిన దేమన ఇట్టి శిక్కుల మహాసభ గతవారము జరిగినందులకు మేము శిక్కులను అభినందించు చున్నాము. అధ్యక్షులవారు తమ అధ్యక్షోపన్యాసములో శిక్కుల విద్యాభివృద్ధికై కొన్ని సూచనలు చేసినారు. అందు రెండు అభిప్రాయములను మన మాదరము జ్ఞాపకముంచుకొనవలెను.

విద్యకై ప్రజలే పూనుకొన్న ద్రవ్య మెక్కడినుండి వచ్చును. అని బెంగపడవనిలేదు. నాందేడు గురుద్వారాలో అపారమైన ఆదాయము వచ్చుచున్నది. ఆద్రవ్యాన్ని శిక్కుల విద్యకే వినియోగించవలెను.

ఈ భావమును హిందువులును ఆలోచించగలరు. హిందువులు దేవళములపై వ్యయముచేసినట్లు మరిదేనిపైనను చేయరు. అతి ప్రాచీనమునుండియు హిందువులు యీఆచారమువలన లాభపడుటకు మారుగా నష్టపడినారు. సోమనాథ విగ్రహమును మహమ్మద్ ఘజనీ పగులగొట్టెను- ఆదేవాలయము నుండి అతడు అపారధనము తీసుకొని పోయెను. నగరకోట దేవాలయంలో అతడు ౭ లక్షల బంగారు దీనారాలను ( దీనారం ఒకటింటికి నాలుగున్నర మారకం) ఏడునూర్ల మణుగుల బంగారు వెండినగలను ౨౦౦ బంగారు ఖడ్డీలను, ౨౦౦౦ మణుగుల వెండిని, ౨౦ మణుగుల కెంపులను, రవ్వలను, పచ్చలను కొనిపోయెను. ఇట్టి పూర్వకాలపు ముచ్చట్లు చాలాకలవు. అవిప్పుడు ముందు వేసుకొని వెక్కి వెక్కి ఏడ్వ వీలులేదు కదా! ఇప్పటికిని తిరుపతి, శ్రీరంగం వంటి మహాక్షేత్రాలలోని విగ్రహాలపై లక్షలు కోట్లు విలువచేయు రత్నాలును నగలును కలవు. మరియు గొప్ప గొప్ప క్షేత్రాలలో భక్తులిచ్చుకొను ముడుపులు, మొక్కుబళ్లు, నిలువుదోపిళ్లు, కానుకలు, దక్షిణాలు, పూజార్లకు నజర్లు, సేవలకు టికెట్లుధరలు ఇవన్నీ లెక్కించుకొంటే మనది బీదదేశం అని అనేదానికి మనకు నోరు రానేరదు. బ్రిటిషిండియాలో మతసంబంధములో "ఎండోమెంటు" శాసనమొకటి చేసి ప్రసిద్ధ దేవాలయముల ఆదాయమును విద్యకై వినియోగించుచున్నారు. ఈ రాష్ట్రములో హిందువులు విద్యలో అందరికన్న వెనుకబడినారు. ఈ సిగ్గుచేటైనట్టి ఘోరకళంకాన్ని మనము తుడిచివేసుకొని అందరితోపాటుగా తలయెత్తుకొని తిరుగవలెనంటే మాకు పరస్పరము అల్పవిషయాలలో జుట్టుపట్లకు పోకుండా ఏదోయొక ప్రశస్తమార్గాన్ని వెదకి ఏకముఖముగా నడుచుట అవసరము.

శిక్కు మహాసభాధ్యక్షులవారు సెలవిచ్చిన రెండవకార్యమేమన

"ఏజాతి తనసంస్కృతిని మరచిపోవునో అట్టిజాతికి ప్రపంచములో జీవించుటకు అధికారములేదు."

అనగా ఏజాతి తన ఉత్తమభావాలను, తన కళలను, తన భాషను, తన నాగరికతను (ఇవన్నీ కలసినట్టి దానికే సంస్కృతియని పేరు) అట్టి ఉత్తమ వస్తువులనన్నింటిని మరచిపోవునో అది నశించిపోవును. తన విశిష్టతను పోగొట్టుకొనును. అన్య సంస్కృతిలో లీనమై పేరు ఊరు లేకుండా పోవును. ప్రపంచములో చాలా జాతులగతి యిట్లేఅయినది. మనలో నేటిజాతియు నిట్టిగతికి పాల్పడకుండుగాత. అట్లు కాకుండుటకై ప్రతిజాతియు తన సంస్కృతిని గాఢముగా ప్రేమించి యెన్ని ప్రతిబంధకాలు వచ్చినను వదలుకొనక, నిర్భయముగా తన సర్వస్వమైనను త్యాగముచేసి తమ పెద్దలు అనేక శ్రమలకులోనై యిచ్చిపోయిన అమూల్యమైన సంస్కృతిని కాపాడుకొనవలసి యుండును. మన రాష్ట్రీయులును ఈ ఉత్తమ నీతిని తేలికగా నిర్లక్ష్యము చేయక దీర్ఘముగా ఆలోచించి ఆచరించి తీరుదురుగాక.

## మార్వాడీ మతము మార్చుకొనుట

నిజాంరాష్ట్రములోని గేవ్రానీ తాలూకాలోని ఒకమార్వాడి ౨౪ అమర్దాదునాడు సహకుటుంబముగా ఇస్లాం మతము స్వీకరించినాడు. మతముమార్చుకున్నతర్వాత ఆతనికివేషము మార్చినారు. అతనిపేరు బాబూలాల్ వయిస్సు ౩౮ ఏండ్లు ఇకముందు అతనిపేరు అబ్దుల్గనీ అని వ్యవహరింపబడును. అతని ౧౫ ఏండ్ల బిడ్డపేరు కౌశిబాయి. ఆమెపేరిప్పుడు కరీంబీ అనిపెట్టినారు. ౭ ఏండ్లకొడుకు పూర్వంపేరు శంకర్ లాల్ దానిని మార్చివేసి యిప్పుడు అబ్దుల్రహీం అని నూతననామకరణముచేసినారు. బిడ్డకు ఉర్దు ఇంగ్లీషు బాగావచ్చును.

(అల్ ఆజం న్యూస్)

## జంతు వైద్యాలయం

హైదరాబాదు (దక్కన్), షహరేవరు ౯ శ్రీబీరారు యువరాజుగారు ౧౨ షహరేవరునాడు సాయంకాలం ౫ గంటలకు హైద్రాబాదునగరంలోని ముస్లింజంగ్ పూల్ వద్ద కొత్తగా కట్టబడిన జంతువైద్యభవనముయొక్క ప్రవేశోత్సవము జరుపుచున్నారు.

హైద్రాబాద్ పల్టన్

హైదరాబాదు (దక్కన్), షహరేవరు ౯ ౕ౨౦ మంది సిపాయిలుకల హైద్రాబాదు పల్టన్ ౯ షహరేవరునాడు అహమదాబాదు నగరుకు వెళ్లినది.

"ప్రకటన"

=:o:=

సుబేదక్కన్ ౧౧-౧౧-౪౯ ఫ నాటి పత్రికలో యిట్లువ్రాసినారు.

"ప్రతిసంవత్సరము "సాల్గిరా పరేడ్" ఫతేమైదానులో అవుతూఉండెను, అదినం సాయంత్రం "మొగలాయిడిన్నర్" జరుగుతూ ఉండెను. ౨౯ జమాదిస్సానీనాడు సర్ఫెఖాసుపరేడు జరుగుతుండెను, ఇవన్నీ "యూరోపుయుద్ధము" వలన ఈసంవత్సరము ఆపివేయబడినది. ౭ రంజానుకు "సింహాసనాధిష్ఠాన జ్ఞాపకార్థము" సేనలపరేడు జరుగుచుండెను, మరియు 'చిరంజీవులైన సాహెబ్ జాదా మొకర్రంజాః జన్మదినోత్సవము జరుగుచుండెను. ఇవికూడా ఆపివేయబడినవి"

==:o:==

## అహింసా విధానము బ్రిటిషుప్రభుత్వ వైఖరి

### గాంధిజీకి బ్రిటిషుప్రభుత్వ సమాధానము

గాంధిమహాత్ముడు బ్రిటిషువారిని యుద్ధమార్గమును వదలి అహింసావిధానమును స్వీకరించవలసినదని ఒక దీర్ఘమైన విజ్ఞప్తినిచేసియుండిరిగదా! దానివిషయమై మహాత్ముడు వైస్రాయిలార్డు లిన్లిత్గోగారికి జులై ౬వ తేదినాడు ఢిల్లీనుండి ఒక లేఖవ్రాసిరి.

"నావిజ్ఞప్తిలో కడపటివాక్యమును చూడుడు. ఈవిజ్ఞప్తిలోని సంగతులను తాము సరియైనవారికి అందజేయగలరా? ఈవిజ్ఞప్తియు, ఆఖరున నేను చేసిన వాగ్దానమున్ను బ్రిటిషుపక్షమునకు స్వయముగా ఉడుతాభక్తియగునట్లు నేనుచేయగల్గినదానిని తెలుపును. అని గాంధీజీ వ్రాసెను.

అందుకు జులై ౧౦వ తేది సిమ్లానుండి వైస్రాయిగారు జబాబు మహాత్మునికి వ్రాసిరి. అది ట్లున్నది:—

"నేను జులై ౭వ తేదినాటి తమలేఖను బ్రిటిషుప్రభుత్వమునకు వెంటనే పంపితిని. మీహృదయమును వారు గ్రహించినారు. కాని వారు యావత్తు సామ్రాజ్యముయొక్క సాహాయ్యముతో యుద్ధమును విజయముకలుగువరకు సాగింపుటకు దృఢనిశ్చయులైయున్నారు. గనుక మీరుచెప్పెడి విధానమునుగూర్చి వారాలోచింపజాలరని ఇపుడు వారివల్ల నాకు తెలిసినది."

## విండ్సరు ప్రభువుగారు

విండ్సరుప్రభువుగారు బాహామా దీవులకు గవర్నరుగా నియుక్తులైనారు. గవర్నరుగానే గాక సేనాధిపతిగకూడ నుందురు, బహామా దీవులను నవి బ్రిటిషువారికిచెందిన 'వెస్టు ఇండీస్' అనబడు దీవులలో కొన్నియైయున్నవి. వీటిలో ౨౦ జననివాసద్వీపములును, కొండలు, గుట్టలుగల అనేకములైన చిన్న లంకలునుగలవు. మొత్తము వీటివైశాల్యము ౪౪౦౪ చదరపుమైళ్లు, జనసంఖ్య ౬౧౭౧౨ వీరిలో చాలమంది స్వాతంత్ర్యముపొందిన ఆఫ్రికాజాతివారు. ఈదీవులలో ముఖ్యమైనపరిశ్రమస్పంజిని సంపాదించి ఎగుమతిచేయుట కలప విశేషముగా దొరకును. ఈదీవులు కెనడాకు దగ్గరనుండుటచే ఈదీవులనుండి టమాటోలు ఎక్కువగా కెనడాకు ఎగుమతిచేయబడుచుండును. ఆహారపదార్థములు, మద్యములు. ప్రత్తి, పట్టు ఈదీవులకు బయటినుండిదిగుమతియగుచుండును.

ఈదీవులకు ౯ మంది కార్యనిర్వాహకుల సహాయముతో ఒక గవర్నరు పరిపాలన నిర్వహించుచుందురు. అందరును ప్రభుత్వ నియుక్తులైన ౯ మంది సభ్యులుగల ఎగువశాసనసభయొకటి ఈదీవులకుగలదు. దిగువశాసనసభలో ౨౯ మంది ఎన్నుకొనబడిన ప్రజాప్రతినిధులుందురు

ఈదీవుల ప్రభుత్వమునకు సంవత్సరము ౧కి ౩౩౪౦౬౧ పౌనుల ఆదాయము ౧౯౩౬లో వచ్చెను, వ్యయము ౩౨౬౨౩౮ పౌనులైయున్నవి

## ౧౦ లక్షలమందినిస్తాను-కాని?

ఇంగ్లీషువారికి యుద్ధములో సహాయముచేయుటకై మాస్టరు తారాసింగుగారు ఇటీవలజరిగిన పేషావరు నగరములోని ఖాల్సాదీవానులో ఉపన్యసించుచు ఇట్లుచెప్పిరి, కాంగ్రెసువారు ఇటీవల తుదినిర్ణయానికి వచ్చినారు. భారతదేశానికి స్వాతంత్ర్యమిస్తేయుద్ధములో అన్నివిధాల సాయంచేస్తామన్నారు. ఈ షరతును బ్రిటిషువారొప్పుకుంటే నేను ౧౦ లక్షలసిక్కుయోధులను యుద్ధములో పాల్గొని సహాయపడుటకై సమర్పించుకొనగలను. అదేసందర్భములో దేశమును విభాగించు ప్రయత్నాలను తీవ్రముగా వీరు నిరసించినారు. పాకిస్తాన్ అనిన్ని ఖాల్సిస్తాన్ అనిన్ని నానావిధాల దేశాన్ని విభాగించవలెనని కోరుట అనర్థాలకు హేతువనిన్ని సిక్కులు మానవసేవ చేయుటయే పరమధర్మముగా పాటించువారనిన్ని ఈదేశములో గొప్పసామ్రాజ్యం స్థాపించి ౧౨౫ ఏండ్లు పరిపాలించియుండిరనిన్ని చెప్పిరి.

## మున్నూరుకాపు సంఘము ఆసిఫునగరు

హైదరాబా॰ (దక్కన్), షహరేవరు ౯

౩౦ అమరుదాదు ౧౩౪౯ ఫ రోజున శ్రీగవ్వల చంద్రయ్యగారి భవనమున మున్నూరుకాపు కులసోదరుల సభజరుపబడి మున్నూరుకాపు సంఘము స్థాపించబడినది:

అధ్యక్షులు: శ్రీ దళవాయి రామన్నగారు ఉపాధ్యక్షులు: శ్రీ పర్వేసత్తెయ్యగారు, కార్యదర్శి: శ్రీ బండారి నరసింహగారు, సహాయకార్యదర్శులు: శ్రీ దళవాయి కృష్ణమూర్తి, శ్రీ గవ్వల నారాయణస్వామిగార్లు, మరి అయిదుగురు

★★★★★★★★★★★★★★★★

## గాంధిమహాత్మునికి రాంనగర్ రాజాగారు అగ్రహారమిచ్చుట

### సత్యాహింసా సిద్ధాంతములను మెచ్చుకొనిఇచ్చిన బహుమానము

పూర్వము భారతదేశమందు నీలిమందుతోటల యజమానుల చిత్తములను మార్చుటకై గాంధిమహాత్ముడు సత్యాగ్రహముచేసియుండిన బీహారురాష్ట్రపు ఉత్తరభాగమందలి చంపారణ్ జిల్లాలోని బిధర్వాఅను గ్రామమును గాంధిమహాత్మునికి కొద్దిరోజులక్రిందట ఇచ్చినాడు. మహాత్ముని ఆత్మశక్తిని, సత్యాహింసా సిద్ధాంతమును మెచ్చుకొని బహుమతిగా ఈగ్రామమును వారు మహాత్మునికిచ్చినారనుచున్నారు, ఈగ్రామము నుండి సంవత్సరము ౧కి రూ౬౦౦ లు ఆదాయము, భూమిశిస్తు కట్టవలసినపనిలేదు.

ఇపుడు ఈగ్రామములో గాంధిమహాత్మునిఇప్పటిఆకృతి పరిమాణమంత విగ్రహమొకటియు. ఒక శీరశాలయు! ఒకచిన్న పరిశ్రమశాలయు ఏర్పాటుచేయవలెనని ఆరాజాగారు తలచినారు. ఈపనిని జరిపించుటకై బాబూరాజేంద్రప్రసాదు, రాంనగరు రాజాగార్లతోపాటు మొత్తము అయిదుగురుగల ఒక ఉపసంఘము ఏర్పాటుచేయబడినది.

★★★★★★★★★★★★★★★★

సాధారణసభ్యులుగల కార్యనిర్వాహకవర్గ మెన్నుకొనబడినతదుపరి, పీల్ఖానాలో శ్రీపతి రంగయ్యగారి భవనమున చైత్ర ౮॥ ౧౦ వాడు జరిగిన సభాతీర్మానములు ఏకగ్రీవముగా నిరపింపబడినవి.

జాబులు

# హైదరాబాదు హిందూమహాసభ

## ఆంధ్రమహాసభాధ్యక్షుని ప్రకటనకు సమాధానము

"ఆంధ్రమహాసభాధ్యక్షులగు మందుముల రామచంద్రరావుగారు జరుగనున్న హిందూకాన్ఫరెన్సునందు పాల్గొనరాదని నిజాంరాష్ట్రాంధ్ర హిందువులకు ప్రకటన గావించియున్నారు వారిప్రకటన ఆశ్చర్యమును పుట్టించుచున్నది వారు వ్యక్తిపరముగా పైప్రకటనను గావించియుండిన మేముదానిజోలికి పోకుండెడివారమే కాని ఆంధ్రమహాసభ అధ్యక్షుని హోదాలో ప్రకటన చేసియున్నందున ప్రత్యుత్తర మివ్వవలసి వచ్చుచున్నది

అధ్యక్షులవారు హిందూప్రజామండలి ధ్యేయోద్దేశములవిషయమై చర్చించుటను నాయాసముగా వదలివేసి, యితరసమస్యలగూర్చి చర్చించినారు. ప్రజామండలి ధ్యేయము ఆత్మరక్షణయే ఆత్మరక్షణ పాపముకాదు

ఇత్తెహాదుల్ ముసల్మీనును గురించి ప్రకటన గావించునప్పుడు అధ్యక్షులవారు స్నేహితుల బలత్కారమునసే అట్లుచేసిరట. మామండలికి విరుద్ధముగ ప్రకటనము గావించినప్పుడు అట్లు చేయుటకర్తవ్యమని చేసిర, ఏహిందువులు సంఘటితులగుటయేవారి నీతికి విరుద్ధము

అధ్యక్షులవారు మామండలిపక్షమున సమావేశము జరుగనున్న సమయము ఆంధ్రహిందువులు యిట్టిసంస్థలకార్యములందు పాల్గొనకూడదని ప్రకటన గావించగలిగిరి. యిత్తెహాదుల్ ముసల్మీనుల సమావేశసందర్భమున వారు నోరు తెరువజాలకపోయిరి, మామండలిప్రచారము అధికమైనందున దానిని అడ్డుపెట్టుటకు పన్నినపన్నుగడనాయిది? అయిన ఈవేషములు యికమీదట సాగనేరవు. హైద్రాబాదులో నూతనయుగము ప్రారంభమైనదని అధ్యక్షులవారెరుంగుదురుగాక,

హిందువులలో హిందూ సంఘటనవాదుల ద్వారా ఐకమత్యము ప్రబలి శక్తిపెరిగిన, అంతఃకలహములు జరుగునట. అధ్యక్షులవారి జ్యోతిషము కడువిచిత్రముగానున్నది ఈ జ్యోతిషము ముసల్మానులను మావిరుద్ధముగా చేయుటకు కాబోలు నేటిఆంధ్రుల పరిస్థితి కనులువిప్పి ఎన్నడైన గమనించినారా. అధ్యక్షులవారు? యిసుమంత ఆశాగల హిందువుల నాశనమును సంపూర్ణముగా చేసితీరును. వారిఆర్థికస్థితి దుర్బలమైయున్నది. వ్యాపారము నశించియున్నది సర్కారు ఉద్యోగములేవు దేశీయ పరిశ్రమలకు ప్రజల ఆదరణలేదు ధర్మముపై ప్రేమభావముగా నశించియున్నది సంఖ్యపూర్తిగా నశించియున్నది వేలకొలది అస్పృశ్యులు ఇతరమతములలో చేరియున్నారు.

ఐకమత్యము అసమానులయందు చేకూరదుకదా? ఒకవైపు ముసల్మానులు శక్తిసంపన్నులగుచుండ రెండవవైపు హిందువులు బలహీనులైన వారిరువురిలో మైత్రికుదురుట సంభవమా? సరిసమానులయందు మైత్రికలుగును ముసల్మానులు శక్తిసంపన్నులైన హిందువులుకూడ అట్లగుటకు ప్రయత్నించవలెను అట్లుప్రయత్నించిన మరుక్షణమే అంతఃకలహములు నశించును

అధ్యక్షులవారు మాసంస్థను సాంప్రదాయిక సంస్థయని దూషించియున్నారు. పనిచేయజాలకున్నను పనిజేయుసంస్థలదూషించుట అలవాటే. మాసంస్థ కేవలము హిందువుల అభ్యుదయమునే కోరినను నేటి సాంప్రదాయికతయొక్క తీవ్రవిరోధి మాయొక్క మేలును మాత్రము మేమాలోచించెదము యితరులకుకీడొనరించిన, సహించి ఆత్మహత్యయనెడి పాపము మేము చేయము ఒకవైపు హిందువులస్థితి హీనముగనుండ జాతీయవాదులమనుచూ, పైవిషయములవైపు కనులెత్తి చూడకుండజాలము.

రామచంద్రరావుగారివంటి మహానుభావులు ౨ సం॥లనుండి చేయుచున్న ఘనకార్యమును మేము చెరుపుచున్నామట. వారివలననే నేటిఆంధ్రప్రాంతము ఆంధ్రప్రాంతమైనదట లేనియెడల ఎన్నడో నశించియుండెడిదట చిన్నచిన్న బాలురు ఆంధ్రదేశచరిత్ర నెరుగుదురు విద్యారణ్య, కృష్ణదేవరాయ హరిహరబుక్క ఆదివీరుల మాతఆంధ్రమాతకాకుండిన ఆంధ్రదేశము సర్వనాశనమునుజెందియుండెడిది అట్టివీరుల స్మరణచేయించి, వారిననుకరణించి. ఆంధ్రదేశమును. ఆంధ్రజాతి, ఆంధ్రభాషను రక్షించుటకు ప్రోత్సహించుటకే హిందూకాన్ఫరెన్సు జరుప నిశ్చయించినాము.

(ఆంధ్రసోదరులారా! ఆంధ్రత్వమును, ఆంధ్రభాషను రక్షించదలంచిన హిందూకాన్ఫరెన్సుకు తండోపతండములుగా విచ్చేసి దానిని జయప్రదముగాసాగించుడు మాయాజాలమున పడకుడు.

మనఅధ్యక్షులవారు కాన్ఫరెన్సు నాపుటకు ప్రభుత్వముతోకూడ వేడుచున్నారు, మంచి పుణ్యముకట్టుకొనుచున్నారు దానవీరుడగు హరిశ్చంద్రుడును యింకేటి త్యాగమును మాయించలేను)

వి. రామచంద్రరావ్
(సెక్రెటరీ హిందూప్రజామండలి)

## సాంకేతికవిద్య

హైదరాబాదు(దక్కను) షహరేవరు ౨
హైద్రాబాదువారికి యుద్ధసహాయములో పాల్గొనుటకై కాచిగూడాలో రైల్వేబస్సులు పెట్టుచోట శీఘ్రకముందు టెక్నికల్ శిక్షణ యియ్యబడును అభిలాషులైనవారు పైస్థలములో ఎఫిసెంటు ఖాద్రిగారిని కలిసి వివరాలు తెలుసుకొనగలరు,

## టప్పాస్టాంపులదొంగ

హైదరాబాదు(దక్కను)షహరేవరు ౨
సికింద్రాబాదులో కొందరు టప్పా డబ్బాలలోవేసిన జాబులపై స్టాంపులను తీసుకొని కొందరివర్తకులకు అగ్గువగా అమ్ముచుండినట్లు తెలిసి కానికై పోలీసువారు కాపలాకాయించిరి అదుపై అబ్దుల్‌రహ్మాన్ అను క్రొత్తటప్పా కొకడు పట్టుబడెను వారియిల్లు సోదాచేసినారు



## హైదరాబాదు యుద్ధసహాయం

### హరికేన్‌ఫండు

శనివారము ౧౩ జులైనాడు హైనిథి ౩౯౯౭౬౨ హాలీ రూపాయీలును రెండు కల్దారు మూసాయీలు వసూలుచేయబడినవి ఆరిక్రింది ముఖ్యమైనవి

౧౦౦౦౦ నిజాంసాగరు చక్కెర కార్ఖానాలోనున్న అజంజాహీ మిల్లున్ను, ౬౫౦౦ మహారాణీసాహెబా గద్వాలసంస్థానము, ౫౧౨౧ రాణీ తారాబాయిగారు బూంజాగీరు, ౩౦౦౦ తాతాకంపెనీ ౨౦౦౦ న మెహిదీయార్జంగు తాండూరు జాగీర్దారు తదితరులును

౧౪ జులై ఆదివారము వనూళ్లు ౧౯౧౦౪ హాలీలు ౧౭౧౨ కల్దారులు ముఖ్యమైన చందాలేవన

౫౫౦౦ బంకట్‌లాల్జీ బద్రూకాగారు ౨౦౦౦ రాజా రంగనాయకమ్మగారు గోపాలుపేట సంస్థానం ౧౦౦౦ వనపర్తి సంస్థానమున్ను మరి౧౦౦౦ సేట్ లాల్‌గిర్జి వినోద్‌గిర్జిగారు ౭౫౦ న. మెహిదీయార్జంగు బ॥గారు ౫౦౦ శివరాజబహద్దరు సంస్థానము ౯౫౦ ఉస్మానియా విద్యార్థులున్ను అధికారులున్ను

ఉర్దూఫిలిం

గురువారం ౧౮ జులైనాడు సాయంకాలం ఆరున్నరగంటలకు క్రౌన్‌సినిమాలో గా. రెసిడెంటుగారియొక్కయు రైట్ ఆనరబుల్ సర్ అక్బర్ హైదరీ గారియొక్కయు అధ్యక్షతలో 'ఔరత్' అను ఉర్దూటాకీ చూపింపబడును. దాని మొత్తం హరికేన్‌ఫండు కియ్యబడును

టిక్కెట్లధరలు రూ ౩, ౨, ౧½, అణాలు ౧౦, ౬ స్త్రీలకు ౨, ౧ రూ

స్త్రీలటికెట్లు బేగం మెహిదీయార్జంగు, లేడీటాస్కరు, బేగం కమాల్‌యార్జంగు బేగం అబ్దుల్‌జబ్బార్, మిసెస్ రుస్తుంజంగు, మిసెస్ హుసేనలీఖాన్ డాక్టర్ ఘోష్ మిసెస్ లిన్నెల్ గార్లవద్ద దొరుకును

పండిత క్రమా

హైదరాబాదు(దక్కను)షహరేవరు ౯
వీరు నిజామాబాదుకు జిల్లాల పరిస్థితుల పరిశీలనార్థము సోమవారమునాడు వెళ్లినారు

## మహబూబునగరం వకీలు

### ఆంధ్రమహాసభకు స్వస్తిచెప్పుకొనుట

ఆంధ్రమహాసభాధ్యక్షులగు శ్రీ మందుముల రామచంద్రరావుగారు కానున్న హిందూమహాసభలో ఆంధ్రులెవ్వరున్ను పాల్గొనకూడదని పత్రికాప్రకటన చేసియున్నారు దానిపై మహబూబునగరం వకీలుగారగు మాడిగేరి నారాయణరావుగారు తమఅభిప్రాయమును వెలిబుచ్చినారని తెలిసినది ఈవకీలుగారు ఇటీవలనే హిందూమహాసభ ఆహ్వానసంఘానికి ఉపాధ్యక్షులుగా ఎన్నుకొనబడినారు ఈనారాయణరావుగారిప్పుడు ఆంధ్రమహాసభ జిల్లాసంఘాధ్యక్షపదవిని వదలుకొని దానితోసంబంధమును తెంచుకున్నారు

## ఆర్య ప్రతినిధి సభ వార్షిక సమావేశము

ముఖ్యమగు తీర్మానాలు

హైదరాబాదు (దక్కను), షహరేవరు ౭
౧౩వ జులైనాడు రాత్రి ౮ గంటలకు నిజాంరాజ్య ఆర్యప్రతినిధి సభయొక్క రెండవ వార్షికోత్సవసభజరిగెను అందుక్రిందితీర్మానాలు కావింపబడెను

(౧) రాజ్యాంగ సంస్కరణములలో మతాలోచనా సంఘములఏర్పాటు గురించి ప్రకటింపబడియుండెను కానిఇంతకాలము గడచినను ఈవిషయంలో ఏమిన్నీ చేయలేదు కావున తొందరగా ప్రభుత్వమువారిని మతాలోచనాసంఘాలను స్థాపించవలెనని కోరుచున్నారు

(౨) ఆర్యసమాజములన్నియు కాలపరిస్థితులనుబట్టి ఆర్యసమాజసభలలో ఎచ్చటకూడా ఏవిధమైన రాజకీయ ఉపన్యాసములు ఇయ్యరాదని తెలుపుచున్నారు

(౩) ప్రభుత్వమువారు జెయిల్లలోనుండు ముస్లిం ఖైదీలకు మతశాఖద్వారా ఏవిధంగా మతబోధనున్ను "నమాజ్" నున్ను ఇప్పించుచున్నారో ఆవిధంగానే జెయిల్లలో హిందువులకు మతబోధ చేయుటకు ఆర్యసభకు అనుమతినియ్యవలెనుఅని ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

## ముస్లింలీగు యొక్క భవిష్యత్తు

### ప్రజలపై ప్రభావము కోల్పోవును

ఆసఫలీగారి ప్రకటన

కాంగ్రెసు కార్యకారిణీ సంఘమువారు ఇటీవల ఢిల్లీసమావేశమందు తీర్మానములో బ్రిటిషు ప్రభుత్వమువారు ప్రస్తుతము యుద్ధము జరుగుచున్నంతవరకు కేంద్రశాసనసభయందలి అన్ని పక్షములవారికిని విశ్వాసపాత్రమైన ఒక జాతీయ ప్రభుత్వమును కేంద్రమున స్థాపించవలెనని సూచించియుండిరిగదా! ఇట్టిప్రభుత్వము నేర్పరచుటచే కేవలము హిందువులకే కేంద్రమున ప్రాబల్యముండునని ఆక్షేపించుచు జులై ౧౫వ తేదినాడు జిన్నాగారొక ప్రకటన గావించియుండిరి ఆప్రకటనలో ఆక్షేపించిన అంశమున జిన్నాగారి అనుమానముతొలగించి, జిన్నాగారి సరియైన అభిప్రాయమును స్పష్టముజేసికొనదలచి కాంగ్రెసుఅధ్యక్షులగు మౌలానా అబుల్‌కలాం ఆజాద్‌గారు ఒక తంతిసందేశమును జిన్నాగారికి పంపించియుండిరి. అందు అజాదుగారు కాంగ్రెసుకోరిన జాతీయప్రభుత్వములో అన్ని పక్షములవారును ఉండగలరనిచెప్పి, భారత దేశములో రెండుజాతులుండవలెనని అంగీకరించిననేగాని ముస్లింలీగు ఎట్టి ఏర్పాటునకుగాని అంగీకరించదా అని అడిగిరి. అందుకు జిన్నాగారు సమాధానముగ అజాదుగారిని అనరానిమాటలననిరి. ఆజాదుగారికి జిన్నాగారిపై విశ్వాసమున్నను జిన్నాగారికి అజాదుగారిపై విశ్వాసములేదనియు, అజాదుగారు ముసల్మానుల భారతదేశ విశ్వాసమును కోల్పోయినారనియు, అజాదుగారు ముసల్మానులకుగాని హిందువులకుగాని ప్రతినిధికాడనియు, కాంగ్రెసు హిందూసంస్థయనియు, అజాదుగారు ఆత్మగౌరవమున్నచో వెంటనే కాంగ్రెసుకు రాజీనామానీయదగుననియు–జిన్నాగారు తమప్రత్యుత్తరమందు వ్రాసిరి ఆజాదుగారు తంతిని తమ ప్రత్యుత్తరమును జిన్నాగారు జులై ౧౭వ తేదినాడు పత్రికలకిచ్చిరి.

ఆసఫలీగారి విమర్శ

జిన్నాగారిప్రత్యుత్తరములో నాజూకుతనము యొక్క అభావము బుద్ధిపూర్వకముగ చేయబడినట్లు ఉపద్రవకరమగునంత ఎక్కువగానున్నట్లును ఆసఫలీగారు అభిప్రాయమొసగినారు వారింకను ఇట్లుచెప్పినారు:

"ఇపుడు భారతదేశ రాజకీయస్థితియందు జిన్నాగారొక్కరే సంతృప్తిపరచ సాధ్యపడనివారని స్పష్టమైనది. ఇకనెంతకాలమీవిధముగా వారు సాగించుచుండదలచిన క్లిష్టస్థితిని సహించుచుండగలిగినది నిర్ణయించుకొనవలసినది లీగులో రాజకీయవివేకము గలవారలు కాంగ్రెసుకును లీగుకును మైత్రికుదుర్చుటకు మౌలానా అజాదుగారికంటె ఎక్కువకష్టమెవరునుపడలేదు, మరొకసారి మిత్రభావముతో చేసిన సూచనను జిన్నాగారు వదలించివేయుటయే గాక గోరుచుట్టుపై రోకటిపోటుకూడ వేసినారు ఇట్లువారు మైత్రిసంభాషణలకు అవకాశము ఎప్పటికీగానిలేకుండ కవాటను బంధించుకొనినారు. లీగు రాదలచిననో అట్టి అవకాశ ముండవచ్చునుగాని, అజాదుగారికి అట్టిఅవకాశము ఎన్నటికినిలేకుండ చేయబడినది తగుత్వరలో తనకౌన్సిలుచే తనసభ్యుల అధికారమును నిలుపుకొననిచో, అతి త్వరలోనే ప్రజలపై తనప్రభావమును గోల్పోవగలదు."

## కుశాగ్రబుద్ధి అగు తెలుగు బారిష్టరు

సుప్రసిద్ధులు, మొగిలితుర్రు వాస్తవ్యులు అయిన శ్రీబారిష్టర్ పార్వతీశంగారిని ఎరుగని ఆంధ్రులుండరు శ్రీవారు దంపతీయుక్తంగా ఈ౨౨వ తారీఖున ఆంధ్రదేశ సంచారానికి బయల్దేరనున్న ఈసందర్భమున వారి ప్రతిభా విశేషాన్ని ప్రదర్శించే ఒకచిన్న సంఘటనను ఇక్కడ ప్రస్తరించడం అప్రస్తుతం కాదు.

శ్రీవారు బారిష్టర్ పరీక్షకోసం సీమకేగం బయల్దేరుతూ, మధ్యని మద్రాసు మహాపట్టణంలో మకాం వేయవలసివచ్చినది.

ఇంగ్లండు చిన్న ద్వీపంకదా, అంతాకలిపి మద్రాసంత వుండువా?...అని వితర్కించుకుంటూవుండగా "పెరీజియన్ హేర్ కట్టింగ్ సెలూన్" అనేబోర్డుకనబడ్డది. బండీ ఆపమనిదిగారు. గుమ్మంలోంచి తొంగిచూశారు. గుండెలుకొట్టుకున్నాయి. కాళ్లుసాగలేదు.

ఇదివరకెప్పుడూ భోజనానంతరం క్షౌరం చేయించుకోలేదు. నేటికది సంప్రాప్తమయినది. ఈ బట్టలతోటి చేయించుకోవడం, స్నానమైనా చేయకుండా అన్నీ ముట్టుకోవడం, ఇవంతావారికి కష్టంతోచింది. దేశోపకారంకోసం ఇటువంటి కష్టాలెన్ని లేకుండా కార్యసాధ నవుతుంది.

ఆ సరంజామంతా చూచేసరికి. ఇది మంగలిదుకాణమున్నా కాదా, పొరపాటున ఏదైనా ఆఫీసులోకి రాలేదుకదా' అనుకున్నారు.

ఆమె (దొరసాని) చిత్రంవచ్చినట్టు సబ్బు నురగ మొఖాన్ని అరిచేతి దళసరిని పామి, కత్తి రాతిమీద నూరకుండానే క్షౌర మారంభించింది.

## ఇండియాలో మోటారుల నిర్మాణం

ఇండియాలో మోటారుకారులు తయారుచేయుటకు త్వరలో ఒక కర్మాగారము బొంబాయిలో నిర్మింపబడును. అందుకు తగుఏర్పాట్లు జరుగుచున్నవి. వాల్‌చంద్ హీరాచందుగారు తుల్సీదాసు కిలాచందు. ధరమ్సేక్రటుగార్లతో సంప్రతించి ౨౪ కోట్ల రూపాయిలు పెట్టుబడితో ఒక కంపెనీని స్థాపించెదరు. సర్ ఎం. విశ్వేశ్వరయ్యవంటి సుప్రసిద్ధ పారిశ్రామికులు కంపెనీ డైరెక్టరులుగనుందురు.

నిన్న రాత్రి ఈకంపెనీ స్థాపించినవారు అమెరికాలోని క్రిస్లరు కార్పొరేషను ఎగుమతిశాఖ అధ్యక్షుడగు ఇ. సి. మూర్పు గారితో ౯నెలలలోగా నిర్మింపవలెనని నిశ్చయింపబడెను.

---

'కత్తి నూరకుండా చేస్తున్నదే, తెగుతుందా?' అని అనుకుని, తెగకపోతే అప్పుడే అడగొచ్చునని ఊరుకున్నారు, పనిచేయించుకున్నట్లే లేదు. సాఫుగా తెగిపోయింది.

అమ్మయ్యా—అనుకుని లేచారు. రసీదు చేతికిచ్చి మూడురూపాయ లిమ్మన్నాడు— సెలూన్ ప్రొప్రయిటరు. నిర్ఘాంతపోయి......వాదనలోకి దిగితే మరిలాభంవుండదని—పక్కన పేనులాగ మాటాడకుండా మూడురూపాయలూ వాడిచేతిలోపెట్టి, చిక్కమొగం తెసుకుని ఇవతలకు వచ్చేశారు

తక్కిన గాధయావత్తూ త్వరలోనే తెలుసుకుందువుగాని,










సంవత్సరము చందా
౭ హాలీ రూపాయిలు
ఆరుమాసాలకు
౩ రూపాయిలు
బ్రిటిషిండియాలో
సం॥చందా
౫-౮-౦ కల్దారు.
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండపత్రిక

# Golkonda Patrika

The only Popular Paper That reaches The masses In the Dominions

Best Medium for Advertisement

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

Volume 15 | Hyderabad-Dn. | Thursday 18 July 1940 | Number 22

## యుద్ధవార్తలు

(మొదటిపేజీ తరువాయి)

మను వీధిలోను, భారతదేశములో ఫ్రెంచి ఇండియాలోను "ఫ్రెంచిజాతీయోత్సవ"దినము జరిపిరనువార్త. లండనులో ఈఉత్సవమును డీగాల్ గారు అధ్యక్షతవహించి జరిపించిరి. దానికి చర్చిల్ గారు పంపినసందేశములో మరల జూలై ౧౪వ తేదినాటికి ఫ్రాన్సుదేశము స్వాతంత్ర్యము సంపాదించి, సంతోషముతో ఈయుత్సవము జరుపుకొనుగాకయనియే ఫ్రాన్సు నేడుపట్టిన ఈదుర్గతికాలములో నాయాశయని చెప్పిరి ఫ్రాన్సులో ఈఉత్సవమును పెటెయిను ప్రభుత్వమువారు జరిపిరి

## బాల్కనులలో చిక్కు సమాప్తి

హిట్లరుగారు మ్యూనిచ్‌లో ఇటలీవిదేశాంగమంత్రి కౌంట్ సియానోగారితోను హంగరీ ప్రధాని, విదేశాంగమంత్రులతోనుకలసి చర్చించుటవల్ల తుదకుహంగరీ తనకు రుమేనియానుండి ట్రాన్సిల్వేనియా ఇపుడేకావలెనని ఒత్తిడిచేయుటచే కలుగవచ్చునని మనము భయపడుచున్న చిక్కు తొలగించబడినట్లేకనబడుచున్నది హంగరీ సంతృప్తిచెంది ఇపుడుతనవిధానమును జర్మనీ ఇటలీలకు అనుకూలముగామార్చినది. రుమేనియాలోకూడ ఎవరుకొనిరో ఏమోగాని అయత్తముచేయబడినసేనలు అనేకములు జూలై ౧౫వ తేదినుండి నిరాయధములుగచేయబడి సెలవీయబడుచున్నవి రుమేనియా విదేశాంగమంత్రి మ్యూనిచ్‌కుపోయి వారినాయకులతోసంభాషించి రష్యాదీనికొన్న ప్రదేశమునుండి పూర్వమెన్నడును రష్యాదికాని ప్రదేశమును తిరిగితనకు వాపసుచేయించవలసినదని కోరుచున్నారనుచున్నారు. ఈసమస్యను పరిష్కరించుటకు హిట్లరు ఏమిచేయునో! కాని ఒకటిమాత్రముసత్యము.జర్మనీకి ఇపుడుకావలసిన ఆహారపదార్థములన్నియు ఈయూరపుదేశాలలో చిక్కుగాపండింపజేసి సంపాదించుకొనవలెనని హిట్లరుతలంపు, అందుకురుమేనియా మున్నగుదేశాలందు తూర్పు యూరోపా ప్రాంతములో యుద్ధభయముపోయి శాంతియుండుటముఖ్యము అందుకై చిక్కువ్యవహారములను సర్దుబాటుచేయుటకు హిట్లరు శ్రద్దవహించకతప్పదు

## జర్మనీ ఆక్రాంత దేశాలు

జర్మనీ ఆక్రమించిన బెల్జియం, నెదర్లాండుసు, లక్జెంబర్గులనుండి అమెరికాప్రభుత్వప్రతినిధులుగునప్లులులనెడి అధికారులను జూలై ౧౫వ తేదిలోగా తీసివేయవలెనని జర్మనుప్రభుత్వము వారి ఆజ్ఞాపించిరి.

ఫ్రాన్సునుండి అమెరికారాయబారి అమెరికాకుపోయినాడు. అమెరికావారికి ఏదో ఆజ్ఞ అందజేయబడునట.

## మన్రోసిద్ధాంతము

మన్రోసిద్ధాంతమనగా అమెరికాఖండ ప్రాంతపు వ్యవహారాలలో ఇతరఖండాలవారు జోక్యము కల్పించుకొనరాదనునది ఈ సిద్ధాంతమును మరల రూజ్వెల్టుగారు పైకెత్తినసంగతిని గతసంచికలో చదివితిమి ఈసారి ప్రాచ్యఖండములకుకూడ ఈసిద్ధాంతమును వర్తింపజేసికొనవచ్చునని సూచనచేయబడినది అదెట్లో గతసంచికయందే చూచియుంటిమి మార్షల్ చియాంగ్ కేషేకుగారు కోమింటాంగు పార్టీయొక్క కేంద్ర కార్యనిర్వాహకసలహాసంఘముయొక్క నిండు సమావేశములో ఉపన్యసించుచుఆసియాఖండమునకు మన్రోసిద్ధాంతము జపాను విదేశాంగమంత్రి అరిటాగారుచెప్పిన అర్థములోఅనగా జపానుఆసియాఖండ ప్రాంతపు వ్యవహారములన్నిటికిని అధిపతియను అర్థములో మేము ఒప్పుకోము అనిప్రకటించిరి అమెరికాకు అసిద్ధాంతము తగియుండి యుండవచ్చునుగాని ఈకాలములో ప్రపంచదేశములన్నియు కలిసి సంఘటనజెంది అన్యోన్యసంరక్షణ గపించుకొనవలెనని చెప్పిరి

అమెరికాలో క్యూబా అనేరాష్ట్రమొకటి ఈ రాష్ట్రప్రభుత్వ మొకసూచనను హవానాలో జూలై ౨౧వ తేదినుండి జరుగనున్న అఖిలఅమెరికారాజ్య మహాసభవారి నుద్దేశించి చేసినది అసూచనఏమనగా, ఇప్పుడుజర్మనీచే జయింపబడి క్రొత్తప్రపంచ గోళార్థమందున్న యూరపియదేశముల రాజ్యము లేవేగలవో వాటికి అన్నిటికిని అమెరికాదేశపు ౨౧ ప్రజాస్వామిక రాజ్యాలు రక్షకములుగా నుండవలెనట, ఈ సూచన అమెరికాలో చాలామందికి నచ్చినదనుకొనుచున్నారు కాని జర్మనీ ఇటలీలు ఇట్టియత్నము లను ఉపేక్షించునా! ఇకలిట్టియత్నము సాధ్యమేనా?

అమెరికాలో పుట్టినసూచన ఇదియొకటేగాదు "యూనియన్‌నౌ" అనుఉద్యమమును ప్రారంభించిన క్లారన్సుస్ట్రీటుగారు అమెరికా, కెనడా, ఆస్ట్రేలియా, న్యూజిలెండు, దక్షిణాఫ్రికా, బ్రిటను, ఐర్లెండుకలిసి, 'స్వతంత్రప్రపంచసంఘటన' అనుపేరనొక ఫెడరల్ సంఘముగా ఏర్పడవలెనని సూచనచేసి దానిపై ప్రచారము చేయుచున్నారు

## అమెరికా

ఈలోగా అమెరికాదేశములో సాధ్యమైనంతత్వరలో రడినిజనుల నేషనల్ గార్డులను (అనగా సేనలను) తరిఫీదుచేయుటకు రూజ్వెల్టుగారును యుద్ధమంత్రి స్టిమ్సన్‌గారును నిశ్చయించి వారు. విమానములను క్రిందకూల్చు సేనలకై ౪రెజిమెంట్లు తయారు చేయబడునట. అమెరికాలో ఫోర్డు మోటారుకంపెనీవారు బ్రిటిషువారికిని అమెరికావారికిని విమానాలకు రోల్సు రాయిస్ యింజనులను తయారు చేసియిచ్చుటకు ఒప్పుకొన్నారు ఇతరదేశాలపై ఆధారపడకుండ రబ్బరును తయారు చేయుటకు అమెరికనులు ప్రణాళిక నిర్మించినారు

అమెరికాలో అధ్యక్షుని ఎన్నికసంరంభమింకను జరుగుచునేయున్నది. ఈసందర్భమున జూలై ౧౫వ తేదినాడు చికాగోలో అమెరికా ప్రజాప్రతినిధిసభయను శాసనసభా శాఖ అధ్యక్షుడగు విలియంబ్యాంక్‌హెడ్ గారుపన్యసించుచు ప్రతి స్వాతంత్ర్యసిద్ధాంతముపైనను యుద్ధముచేయుటయే ధర్మముగాగల పరాక్రమశీలులను సంతృప్తిపరచుట అమెరికాపనికాదని చెప్పిరి. మరియు అమెరికాశాసనముల ప్రకారము వీలైనంతవరకు బ్రిటనుకు సకలవిధముల యుద్ధములో సహాయము చేయవలెననిచెప్పిరి ఈఉపన్యాసము జరిగిన డెమొక్రాటికుపార్టీ సమావేశములోనే రూజ్వెల్టుగారు తనకు ప్రతిపక్షులుగ ఎవరుగాని నిలువకుండినసేగాని తాను ఈసారి అధ్యక్షుడనుగా పోటీచేయనని చెప్పిరి

## ఇటలీతోయుద్ధము

ఇటలీతో బ్రిటనుయుద్ధములో రెండు ముఖ్యాంగములు ఈసారిగమనించదగినవి ఏర్పడినవి అందొకటి బ్రిటిషువారికిజెందిన మొయేలుపై ఇటాలియాసేనలదాడి ఈదాడి జూలై ౧౦వ తేది బుధవారమునాడు ప్రారంభమైనది కోటలోనున్న బ్రిటిషుసేనలు చుట్టుముట్టడివేయబడినది. బయటినుండి సేనలను పంపించవలసినదని కోటలోనివారుకోరినారు జూలై ౧౨వ తేదినాడు పిరంగులచేపాడుచేయబడిన భాగములు ౧౩వ తేదినాటికి రిపేరుచేయబడెను. జూలై ౧౪వ తేదినాటికి ముట్టడియింకను అటులే యుండెను ౧౫వ తేదిఅక్కడినుండి లేచిపోయెను, ఈమొయెలు ఆఫ్రికాలో కెన్యా, అబిసేనియాలమధ్య సరిహద్దులోగలదు సోమాలిలాండులో అబ్దుల్ ఖాదిరీ ఇటాలీయులచే పట్టుకొనబడినది. లిబియాలో యుద్ధారంభములో బ్రిటిషుసేనలు పట్టుకొనియుండినరెండు ఇటలీయులకోటలను జూలై ౧౩వ తేదినాటికి ఇటాలియులుమరల ఆక్రమించుకొనగల్గిరి.

అముఖ్యాంశములైనఅంశములు సోమాలిలాండు సరిహద్దువద్ద ఇటాలీయుల సేనలపై బ్రిటిషువారు రోజూదాడివెడలుటయే. అజీరుమీద జూలై ౮వ తేదినాడుదయము, ఏడెనుమీదను, మాల్టామీదను జూలై ౧౨వ తేది, అలెగ్జాండియాపై జూలై ౧౪వ తేది ఇటాలీయా విమానాలనుండి బాంబులువేయబడినవి ఇటలీవారి డిస్ట్రాయరొకట సముద్రములో ముంచివేయబడినది

ఇకరెండవ ముఖ్యాంశమేమనగా, మిత్రమండలివారి సముద్రపురేవులనుండి ౩౦ మైళ్లలోగా ఏఓడయేగాని సంచరించుట ఉపద్రవమునకులోనగునని ఇటలీవారు ప్రకటించిరి. దీనికిప్రతిగా బ్రిటిషువారు ఇటలీరాజ్యమునుండియు మధ్యధరాసముద్రమునుండియు ౩౦ మైళ్లలోగా ఓడలు తిరుగుట ఉపద్రవకరమని ప్రకటించినారు కుక్కకాటుకు చెప్పుదెబ్బకు సరిపోయినది

## జర్మనీ విమానాల దాడులు

జూలై ౧౧ ౧౨ ౧౩, ౧౪ ౧౫వ తారీఖులలో బ్రిటనుపై జర్మనువిమానాలు దాడివెడలి అక్కడక్కడ బాంబులువేసినవి ఈవిమానాలతో కొన్నికొన్ని సమయములలో బ్రిటిషువిమానాలు పోరాడి తరిమివేసినవి [illegible] మొ[illegible] పోరాటము జూలై౧౫వతేది [illegible] జరిగినది [illegible] విమానా[illegible] ఓడలపై బాంబులువేసి నాశనముచేయు [illegible] జూలై౧౮వతేది [illegible] బ్రిటిషువారి వర్తకపుఓడలకు తోడుగా [illegible] నాశనముచేయుటకై వచ్చిన జర్మను విమానాలతో బ్రిటిషువిమానాలు చేసిన పోరాటము పేర్కొనదగినవి. ఇవి పెద్దపోరాటములు. అనేకవిమానములనుఎదుర్కొనవలసివచ్చిన సమయములివి ఈరెండుపోరాటములలోను బ్రిటిషువిమానములు శత్రువిమానములను కొన్నిటిని క్రిందకూల్చినవి కొన్ని పారిపోయినవి.

బ్రిటిషువారి దేశములో కొన్నికొన్ని పట్టణములపైకూడ జర్మనువిమానాలు బాంబులువేసినవి. వాటివల్ల కొన్నిభవనాలకు ఉపద్రవము కలిగినదట, కొందరుమనుష్యులకు గాయాలైనవి కాని ఈనష్టము ఎంతెంతయుండునను విషయములు జర్మనులు ఎక్కువగాను,బ్రిటిషువారు తక్కువగాను చెప్పుచున్నారు. ఇట్లు వివాదాస్పదమైన అంశములో వివరములను తెలిసికొనవలసిన అవసరములేదు

బ్రిటిషువిమానాను జర్మనీపైనను, జర్మనీ ఆక్రమించిన ఫ్రాన్సు, హాలెండు, బెల్జియం మున్నగుచోట్లపైనను తిరిగి ఓడలుండుచోట్లు, మందుసామగ్రి కార్ఖానాలు, విమానాశ్రయములు, రోడ్లుమున్నగు సైనిక ప్రాముఖ్యముగలవాటిపై ప్రతిరోజు బాంబులను వేయుచున్నవి వాటివల్ల కలిగిన నష్టమెంతయని ఉభయపక్షములు అంగీకరించుమాట వచ్చువరకు, వివరములతో ప్రయోజనములేదు

## బ్రిటిషునాయకుల ఉపన్యాసములు

జూలై ౧౧వ తేదినాడు చర్చిల్ గారు బ్రాడుకాస్టు ఉపన్యాసముచేసినారు. అందు యుద్ధము చాలాదీర్ఘముగానుండునని తోచుచున్నదనినారు అది ఎక్కడికివ్యాపించునో తెలియదనినారు. కాని ఏపరిస్థితిలోనైనను బ్రిటిషువారు లొంగరని సింహనాదముచేసిరి ఫ్రాన్సు, హాలెండుమున్నగునవి జర్మనీకి లొంగుటకుముందే క్రుళ్లియుండెననియు, అట్టి క్రుళ్లుబ్రిటనుకు లేదనియు, లండను నాశమైనను బ్రిటిషువారు లొంగరనియు, ఇపుడుబ్రిటనులో ౧౫ లక్షలమంది సైనికులు సాయుధులైయున్నారనియు, వీరేగాక ౧౦ లక్షలమందికి మించినవాలంటీరు సైనికులున్నారనియు, సాయుధములైన పెయ్యిఓడలున్నవనియు చెప్పిరి

బ్రిటిషు నౌకామంత్రియగు ఏ. వి. అలెగ్జాండరుగారు జూలై ౧౪వ తేదినాడు బ్రాడుకాస్టుచేయుచు, ఫ్రాన్సు జర్మనికిలొంగగానే బ్రిటిషువారు స్వదేశములోనుండియే పోవలసివచ్చెననియు, డొమినియనులకు పోయి అక్కడినుండిగాని పోరాటముసాగించలేని సమయము పరిస్థితులు ప్రతిమించినసేగాని రాదనియు, ఈలోగాబ్రిటనును వదలకపట్టుదలతోపోరాడినచో త్వరలోయుద్ధములోజయముచేకూరగలదనిచెప్పిరి

బ్రిటిషువారి అదృష్టాన వారికిపుడు పోలెండునుండి జెకోస్లావియానుండి తప్పించుకొనివచ్చిన సైనికులుకొందరు చేరినారు

## కేశవ మెమోరియల్ స్కూలు

హైదరాబాదు (దక్కను), షహరివరు ౧౦

స్వర్గవాసులైన పండితకేశవరావు (హైకోర్టు న్యాయమూర్తి)గారిజ్ఞాపకార్థము ఆర్యసమాజమువారు ౨౦ జూలైనాడు కాచీగూడలో ఒకకిరాయిబంగ్లాలో ఒకఉన్నతపాఠశాలను స్థాపించుచున్నారు. హైద్రాబాదునగరములోని నారాయణగూడాలో ౭౫౦౦ చదురపుగజాల స్థలమును కొనినారు, బంగ్లాకట్టుటకు ప్రారంభింతురు. దానికిసుమారు ౫౦వేలుపట్టును అదిపూర్తిఅయిన తర్వాత దానిలోపాఠశాలనడుపబడును ఈపాఠశాలలో మెట్రిక్కువరకు విద్యచెప్పింపబడును. పైగా ఆర్యసమాజ మతబోధకూడ చేయబడును.

## హాతుతుత్తూ ఆట

హైదరాబాదు (దక్కను), షహరేవరు ౧౦

ఇదిమన దక్కను దేశములో చాలవ్యాప్తిలోనున్నఆట, గతవారము హైద్రాబాదునగరపురపాలక సంఘపక్షమునుండి మెహదీనవాజ్ జంగ్ కప్ పోటీఆట హైద్రాబాదులోజరిగెను. సికింద్రాబాదువారు ఇతరులును అందుపాల్గొనిరి.

ఆటచూచుటకుచాలామంది గుంపులుగా కూడియుండిరి. ఫాదర్ఘాటువద్ద విక్టరీ ప్లేగ్రౌండులో యింకను ఈఆటలుజరుగుచున్నవి ౧౭, ౧౮, ౨౨, ౨౪ జూలై తేదీలలో దినముసాయంత్రము ౫ గంటలనుండి ఈపోటీలు జరుగును.

## ఉత్కళరాష్ట్రములో మిశ్రమంత్రివర్గ నిర్మాణ యత్నము

ఉత్కళరాష్ట్రములో శాసనసభయందు జేపనలిస్టు పార్టీనాయకుడగు పర్లాకిమిడి రాజాగారు కొందరు కాంగ్రెసువారలతో కలిసి మిశ్రమంత్రివర్గమును నిర్మాణముచేయుటకు ఆలోచనలు చేయుచున్నారు ఆరాష్ట్రకాంగ్రెసు నాయకులు కాంగ్రెసువారు ఇట్టి ప్రయత్నములతో ఏమాత్రము సంబంధముగాని పెట్టుకొనరాదని హెచ్చరికలు గావించుచున్నారు. పూర్వపు కాంగ్రెసు ప్రధాని విశ్వనాధదాసుగారు తమ ఇతర కార్యక్రమాన్ని కట్టిపెట్టి జిల్లాలనుండి వెంటనే ఈవిషయమున కాంగ్రెసువారలను మిశ్రమంత్రివర్గానికి తోడ్పడకుండ చేయుటకై కటకమునకు చేరుకొనినారు



Printed and Published by, G Ram krishna Reddy at the Golkonda Power Press Hyderabad Dn. Editor S Prathapa Reddy B A L L